కున్నను, పాపంబున కైన వెఱవ వలదే? నేనిప్పుడు నిరాశ్రయతా దశను గ్రుగ్గి, కాటికిఁ గాళ్ళు సాఁచుకొని యున్నాఁడను. ఇట్టిచో నట్టికట్టిఁడి నైన, ధర్మేతరుండయి నీతిబాహ్యం బైన కార్యంబున గొడఁబడుదునే? ఒరు లేయువి యొనరించినఁ దనమనమున కప్రియ మగునో, యాయవి తానొరులకుఁ జేయకునికియే, సర్వశాస్త్రసారం బైన పరమధర్మము. నేనును బాల్యమునుండియు నినుఁబోఁటిదొంగ కలవారిళిష్ఠులని పెరిఁగినవాఁడనుగాని, తెలిసి వమాలిన నడవడిం బ్రవర్తించినవాఁడఁ గాను. మిత్రుఁడా! నీయాలోకంబున నాతమో నిచయంబులు పటాపంచ లయ్యెను. నే నెప్పుడు నీపొందునకే మున్నును గ్రుక్కిళ్ళు మ్రింగు చుందును. నేఁటికది యీనిమిత్తంబున సిద్ధించినది. నీచెలిమి యబ్బిన ధన్యుండు సర్వజనమూర్ధన్యుఁడు గాఁడె? భవత్సందర్శనంబున వేవు రాప్తులువచ్చి మ్రోల నిలిచిన ట్లున్నది. లోకంబున మంచివారికి సజ్జనదర్శనంబునకంటెఁ బరమలాభంబు కలదే? నీపరోపకారచింతకు నాస్వాంతం బెంతయు సంతసించె. ఎవఁడు చేసినధర్మంబు వానిఁ గాచును. కావున, మతిమంతులు కాలుచె య్యాడుతఱినే ధర్మమునందు బుద్ధి నిలుపవలయును. ఆవల జవసత్వంబు లుడిగి, యస్థిచర్మావశేషావయవంబులతో ముదిమి గదిరి యున్నప్పుడేమి సేయుటకును బురుషుండు సమర్థుండు గాఁడు. అంతియ కాక యాయువును, వాయుచలితదీపకళికయుంబోలె, క్షణభంగురంబై యుండును. అది విచారించి, ధర్మకార్యం బెల్లి చేయవలయునది. నేఁడును, మావు చేయవలయు నది తేవును, జేయుచుండవలయును. 'ధర్మస్యత్వరితాగతి' యను పురాణవచనమును బాటింపవలదే? దుఃఖ సముద్రంబున మునుంగఁబోతి, నిరాధారంబుగ నున్న నాకు నీవొక తెప్పగాఁ దారసించితివి. అహా! యేమి నాభాగ్యము! అడఁబోవుతీర్థ

పొందు రమ్మోయను! నేను నీతోడు వేఁడికొన వేగిరపడుచుండ, నింతలో
దయాచిత్తంబుగ నీవే నన్నుఁ దరింపఁ దలంపుఁగొంటివి. నీవంటిపుణ్య
కర్ముండు లోకంబున నొండొక్కరుండు గలఁడె? నీకీక్షణమాత్రం
బున కీలాగున భయపడ నేల? నాప్రాణము రక్షించితేఁ జాలును.
భవదిష్టంబే నవశ్యంబుగఁ గావించెద. గుండెబెదరు దీఱి నాసరస
కరుదెమ్ము. నాప్రాపు గలిగి యుండ, నిన్నీచపేచకంబు చెనకి
మయిమయింబోవ నోపునె? నీకొక్కయాపద రాకుండ నాప్రాణ
మడ్డము వైచెద: చెచ్చెరవచ్చి, యాయుచ్చువ్రచ్చుపనిఁ బూనుము.
అనిన, నాయుందురువు డెందంబున నానందించి. వల్లెయని, మెల్లన
నాచీలి సమీపంబునకుం జనియె. అదిచూచి, మనసు నిరాశ చేసికొని,
యులూకంబు తనవచ్చినత్రోవఁ బట్టి తిరిగిచూడక మరల తన యిరవున
కరిగెను. అంతఁ బోయయు జాగిలమ్ములు పెక్కులు ప్రక్కలంజలసి
చనుదేర, జముదూతవలె నేతెంచుచుండెను. మార్జాలం బాయెలుకను
దూరమునుండి కాంచి, గుండియ రాయివడి, యంగ మాకంపింప,
నెలుక కిట్లనియె. "చెలికాఁడా! మనము మాటల సందడిని మఱచి,
యేమఱి యుంటిమి. చూడు మదిగో — నావథంబున వ్యాధుండు
దండహస్తుండై రెండవ దండధరునోజం జనుదెంచు చున్నవాఁడు.
ఆక్రూరకర్ముండు నాకంటఁ బడ్డప్పటినుండియు, నాప్రాణంబులు
నా మేనలేవు; చిత్తంబు స్వాయత్తంబు గాక తత్తరించుచున్నది. ఇంక
నాబ్రదుకెల్లను నీచేతిలోనిదయి యున్నయది. పుట్టి బుద్ధెఱుఁగుట
మొదలెన్నఁడును మున్నిట్టి కష్టములకు లోనైనవాఁడఁ గాను.
కాలవిలంబనాసహిష్ణుత్వంబున జలదరించుచున్న నన్ను భయవిహ్వలు
నాన్మృత్యువుబారిం బడకుండ వేగ విడుగర సేయుము.' అనిన,
మూషకంబును నురిచేరులు కొఱుకుట నటించుచు, 'నోడ

కోడకుఁ బిడె విడిపించెద' నని లుబ్ధకుండు సహసమ్మునఁడగు నంతకుం గడపి, వాఁడును గడుపికటం బగుడు, వడివడిం ద్రాడు తెగఁ గొఱికి, యొక్క పరుగునం బోయి, తనబోరియుం జొరఁబాఱె. లబ్ధ మనోరథం బగునోతువును ముంగలఁ జెంచుంగాంచి, దరమర్దితం బగు హృదయం బున, నాక్షణంబ వృక్షసమారోహణం బాచరించె. శిథిలప్రయత్నుం డయి నిసాముండు, విషాదనంబున నురి పోరిపోవుటకు నాసికా శిఖా గ్రంబునఁ గరతర్జని మోపి యబ్బురపడుచుఁ దనయిచ్చం జనియె. అంత నావృషదంశకంబు మ్రాను దిగివచ్చి, యెలుకం జేరుకొని యిట్లనియె. మిత్రుఁడా! పరోపకార కారణంబున, నన్నిట్లన్నిటం జాలియున్న సంగతి కానిం బనసియు, సౌహార్ద సౌఖ్యం బనుభవింప నొల్లక, యేల జేలతనంబున ఫలవిముఖుండ వయ్యెదవు! ఇంకొక తడవ నీవచోమృతంబు నాచెవులకుం జవి చూపుము. నేఁడు మొద లుగా నాసిరి యనుభవింప నీవును భాజనంబ వైతివి. నీవు వెలిగా నొక మంచిపదార్థంబు గుడువ నామన సొగ్గకున్నయది. నా కెల్ల చుట్టంబులును ఒక్కరుంబులును నీవ. నాయిల్లు నీయిల్లుగా భావించు కొని, నేఁడును తేవును నీవవశ్యము మద్గృహంబున నన్నపా నాదిపూజనంబులు గయికొని, నా భవనమ్ము పావనమ్ము చేయ నది. ఇదిగో మదీయంబు లగు నర్థంబును జీవితంబును భవదధీనం బులు. ఇంక నన్ను నీవాఁనిఁగా నెంచుకొనుము. ప్రాణరక్షణం బొనరించి మించిన మహోపకారిం బ్రియపూర్వకంబగు గాఢాలింగనం బున నయిన గారవింపక, కృతజ్ఞతాలేశం బెట్టికట్టేఁడి నయిన మది కుదిరియుండ నిచ్చునే! ఇప్పుడు నీగాఢ పరిష్వంగసౌఖ్యం బొనంగక వేటు నేయుట, నెయ్యునిదెస కూర్మి కలనేయుటగాని యెంతుగాదు; వేవేగ వివరంబు వెడలివచ్చి, నన్నక్కునం గదియించి మన్నింపుము."

అనిన బిలంబులోనుండి మూషకం బిట్లనియె. ఒకప్పుడు ప్రయోజనం బపేక్షించి విపక్షుని తోడి సఖ్యం బంగీకరించియు, బుద్ధిమంతుఁ డేమఱి యుండఁడు. ఇప్పుడు నీవాచరించు తత్తఱపునకుం జిక్కి, చొక్కి, యుండుట నాకు బ్రదుకు తెరువు గాదు. నీవింతదనుకం బాశంబునఁ జిక్కికొని మిక్కిలిబడలి పేరాఁకలి గొనియున్న వాఁడవు; ఉదరంబు వెన్నంటుకొని యున్నది; కన్నులు గుంటలు పడ్డవి; నీ కిప్పుడు చలిది వలసి నెయ్యంబు కరంబు నెఱపుచున్నాఁడవు. నీమాయ మాటలకు లోఁబడి, ప్రాణంబులు గోలుపోదునే; నీ నెయ్యంబునకును నీకును వేయునమస్కృతులు. ఇంక నీవిక్కడ మఱేమియుఁ జదివి చంపక, యీవట్టిభ్రమలు మాని నీదారిం దలయెత్తక పొమ్ము. ఇంతకుముందఱ యాలుబ్ధకుపాశంబువలన వెలువడియు, మరల నింతలో నీవు రాశాపాశంబులఁ గట్టువడఁ గోరెదేల?" అని తెగనాడి, కలుఁగు వదలక యెలుక సుఖంబుండె. అంత నామాటల మనసు విఱిగి, చీలియు హస్తగతం బగు ధనంబు నోనాడుకొన్నకరణి సంతాపించుచుఁ జనియె.

"కాఁబట్టి శత్రువుతోడఁ గూడి మనవలసిన యవసరంబు నందును. అప్పు డేమఱి యుంటమాత్రము కానిపని. ఈప్రయోజనంబునకు మఱేమియు విచారింపఁ బనిలేదు. ఇఁక నీవు మాటాడకు, మిూకని చేసికొమ్ము" అని, మఱియుం గలశంకలన్నిటికిం బరిహారంబులు సెప్పి మఱియు నిట్లనియె. "విరోధి వరూధినితోడఁ గూడి, మలయపర్వతమ్ము నెత్తమ్మున విడిసియున్నవాఁడు. ఇట్టియెడ మనలో మనము త్రొక్కులాడుట పగతుని కార్యసిద్ధికి నుపకారంబు. కావున నీచెనఁటి వివాదంబు మాని, కార్యైకతత్పరుండ వయి, ముందుగాఁ బ్రస్తుత కరణీయంబు విచారింపుము." అనినఁ బక్షాంచలంబులు

వాల్చి తనలోఁ దా నింతసేపు చింతించి, రాజునకు మంత్రి యి
ట్లనియె. "చిత్రవర్ణునిచేతఁ బ్రత్యాఖ్యాతుం డయి, యాతనిమంత్రి
యుపేక్షాపరుం డయియున్నవాఁ డని వినియున్నాము గదా? ఇది
యొక్కటియె మనకార్యసిద్ధి కత్యంతప్రయోజనకారి. అంతియకాక,
పరవశుండును, బ్రమాదియు, యోధావమంతయుఁ బగతురకు సుఖ
భేద్యు లగుదురు. ఈచెప్పిన లక్షణంబు లన్నియు నిప్పుడు చిత్రవర్ణుని
యందుఁ గన్పట్టుచున్నవి. ఆతనివాహినీనాథులును మార్గాయాసపర
వశులై, ప్రమాదు లయి యుందురు. దీర్ఘమార్గపరిశ్రాంతంబును
క్షుత్పిపాసార్దితంబును నయి, సైన్యంబు దైన్యంబు గదిరి యుండును.
ఆబర్హిప్రకాండుం డింతవఱకు నస్మద్దుర్గావరోధంబు గావింపఁ
బ్రమత్తుండయి, తన్నుఁదా నెఱుఁగకున్నవాఁడు. కావున, నభియాతులఁ
బరాభూతులఁ జేయు నిది మంచిసమయంబు. నద్యద్రివనమార్గంబు
లవరోధించి, విరోధివరూధిని వధియింప మనసారసాముల వేగ నియ
మింప వలయు. మాకు బుద్ధి యేమి? అనిన, నమ్మాటలకుం బ్రము
దితాంతరంగుం డయి, కార్యత్వరాసముత్సాహదోహలిత హృదయుం
డున రా జిట్లనియె. "మనవా రిత్తఱి వైరిం దాఁకించి బీరం
బులు తోరంబులుగాఁ బోరిన వచ్చు నా గౌరవముగానియందుల
కుంగాని యీయాకారగౌరవంబు గౌరవముగాదు. దురంబున నర
వాయిగొనక, మీరందఱుఁ బ్రాణాత్యయపర్యంతంబుఁ బోరునది.
కాలవిలంబనంబు సేయక యందఱిమన సౌఖ్యమై నడువుండు." అని
యానతిచ్చె. ఆమాటలాడుటయె తడవుగా, సేనాపతియు మహో
త్సాహంబునఁ బృతనాపుంజంబులతోడ నడచి, కడునడచినబడలిక
నొడళ్ళు తూఁగాడఁ బోడిమి చెడియున్న పరబలంబులపయి నేయుఱు
పాటునం బడి, వేఁటిమి చూపి, పక్షవాహనంబులఁ దూలించి, కాతనఖ

చంచుపాతనంబుల నొంచి, పాలికలన నెత్తురు గుమగులు గట్టించి, పలువుర మూపుమూపులం జిత్రవర్ణంబు విపక్షపక్షపక్షిపక్షనఖతుండా ఘాతముల్కల నేలం గూలి కీలెడపిన జంత్రపుబొమ్మలుం బోలెం గాలు కాలం బెనంచికొని చాంపకట్టునపడి యున్న నిజసైనిక నికరంబుల విలోకించి, నిర్విణ్ణుండయి, బహిర్లిఖితచిత్రాకారంబు పగిదిం గొంతవడి చేష్టలు దక్కియుండి, మగుడ నెట్టకేలకుం బరిజనప్రయత్నంబునం దెలిసి, దారుణరణకరణస్మరణంబు చిత్తంబు నత్తలపెట్ట, దూరదర్శిం గాంచి, సవిషాదంబుగా నిట్లనియె. ఇప్పగిది నొప్పనివారివలన మన దళంబులకుం దెప్పరంపు ముప్పు వాటిల్లుచుండం, గానివానిరొప్పున నొప్పరికించి చూచుచుండుట నీయట్టిదిట్టకుచితంబే? నీయుపేక్షా నిర్ఘాతంబె పరిపక్షయంబునకు హేతుభూతం బయినది. మనసైన మన సైనికనికాయంబులోం గాయంబు గాయంబు గానివాండు మందునకైనం గానరాం డయ్యెడును. మా యదృష్ట మిట్లుండ, నిన్నిట్టట్టనుట నేరము. అయినను, మన మొనకొక చెట్ట పుట్టిన, నిందుం బ్రసిద్ధులరు మీరకావున నది మీతలనె నిలుచుంగాని, మీ రప్పాకు తప్పించుకొండమన్నం బోవునది కాదు. కృతమతి వగు నీమంత్రము పెడచెవులం బెట్టి, వాక్పారుష్యంబు చూపిన నాపాప ఫలము తోడనె కట్టి కుడిపినది. భవదంతఃకరణంబునం గరుణం గొనిపి, యింతదనుక నానోర వెడలినప్రల్లదంబు లెల్ల మఱచి నన్నుం జల్లనిచూపునం జూడుము. లేదా, యీదండులం దోడుకొని వింజపుంగొండకు మార్గంబు వెట్టుము. నాగతి దైవంబెట్లు కావింపం దలంచె నట్లయ్యెడు — రామే నున్నది, ఈవింధ్యాటవి యున్నది. అంతేకాని, రాజసని యీబలంబులు వాలియుండాడి సహింపజాల. అకారణంబు, డగీ తాటుపడి సందడించునలబలం బిప్పు దలబలంబు

లేక, ప ట్టడఁగియున్నది; నాయాకారంత బలఁగంబును స్వల్పావశిష్టం బయి, కాదుపడియున్నది. పేరింకూడ, నెల్లు చూచిచూచి వైరుల వాతఁ ద్రోయుదును? ఇదె పుణ్యమును పాపమును నీవయిం బెట్టితిని. ఇఁక, నేఱిచినను నేఱకున్నను గాఱిచికొని రావలయును. న న్నియపారవిపత్పారావారంబున ముంచినం దరిఁ జేర్చిన నీదె భారము." అని న్యాయనిష్ఠురంబు లాడి, కరుణ పుట్టునట్లు మడిసినదండంబుల దడవి తడవి కరరివలె విలపించిన, మనము కరఁగి దూరదర్శియుఁ దొంటికోపం బెల్ల దిగఁ ద్రావి, ప్రసన్నముఖుం డయి రాజున కిట్లనియె. "దేవా! దేవరయవార్యశౌర్య విజృంభణంబున దుర్గం బాక్రమించి, లబ్ధవిజయులమై సమస్తవస్తువులం జూఱకొని, యచిర కాలంబునకు భవదుక్తప్రకారంబుగా వింధ్యాటవికి జనుదము. సుఖదుఃఖంబు లెంతవారికి ననుభావ్యంబులు కావె! ప్రాగ్జన్మకృత కర్మాధీనంబు లైన వీని నెవరు పొందకుండఁగలరు? ఆయువు మూఁడి యీచన్నవారికై శోకంబు మాని, కార్యపరుండవు గమ్ము. ఉపాతశేషపరిమిత బలంబులతోడ నపరిమితవృతనావృతుం డగు నహితు నెట్టు నిహతుం గావింపఁ దలకూడు నని చింతిలవలదు. లోకంబున నుపాయశాలికి, లోఁకువగానియర్థంబు లేదు. దేవర నిజముగాఁ దలఁచినఁ గలన నీయలఁతిమూఁకల గెలువ నెంతసేపుపట్టును! నాసామర్థ్యంబు నేఁ జెప్పవచ్చిన, హాస్యాస్పదంబై చూపట్టును. మఱియు నాత్మప్రశంస యనర్థంబు; నన్ను నే నన్న నేల? నా బారిం బడ్డవారు ముందఱ నాచే నెంద ఱెట్లయ్యెదరో, నీవ యెఱింగెదవు. తక్కినసీలెంకల బలశౌర్యంబులును దలంప లోకసామాన్యములు గవు. ఏనుంగుంబోలె నీబలము నీవెఱుంగవు. నీ భ్రింకుక యులిగిచూచిన, నీముందఱ హొంసలుగింపలు నిలువఁ గలవె! మన

మండలమును గూడి తెరువు లరికట్టి, యెట్టివారికిఁ జొరవ యీక, లోనివారిం గదుపుచ్చున లోపలన దరికొనునట్లు సేయవలయు. మన వారిం దొలుత దుర్గద్వారం బవరోధింప విధింపుము. దీర్ఘసూత్రత విజయసిద్ధికి హేతువుగా వివేకిలోకంబుచే గణియింపంబడు. అయ్యదియు నిమ్మెయి సిద్ధం బయ్యెను. ఇంకఁ గార్యసిద్ధికిఁ సంశయం బెయ్యది? సముత్సాహంబు వాటించి, దళవాయిని రణవిహారణ క్రీడకుం దీవరింపుము. జయశ్రీ వరింపుము." అని యాతని యనుభావంబునకుఁ బ్రోద్బలంబుగాఁ బలికిన, వాఁడు నంతరంగంబునం బొంగి నింగిముట్టె.

అంతట మున్ను పంపఁబడిన రెండవప్రణిధి ధనళాంగుండు రయంబునం బఱతెంచి, హిరణ్యగర్భుం గానిపించుకొని, నమస్కరించి యిట్లనియె. "స్వామీ! యవధారు. ఆపాఁపమేఁపరిదొర మొలకల పొలుంగులు తుఱంగలిగొనం దనచేరువతో నీచేరువం జనుదెంచు చున్నవాఁడు. భగ్నమనోరథుండయి యాతండు తనమంత్రికడకుం బోయి వేలాగుల బతిమాలి. యతిప్రయత్నంబున నాతనిం బ్రసన్నుం గావించుకొని, తనమంత్రోపష్టంభంబున విజృంభించి, యాతనివచనంబులె మహావలంబంబుగా నస్మద్దుర్గావరోధంబు సేయ నిశ్చయించె. ఇంక నవశ్యానుష్ఠేయం బైన కృత్యంబుపయిం దలఁపు నిలుపుము." అనవుఁడు, చక్రాంగపుంగవుండు రథాంగంబు మొగంబుఁ జూచి, "సర్వజ్ఞా! మీఁదఁ జేయవలయుపని యేమి? చెప్పుము." అనిన వాఁడక్కవల మేలుబంతి యిట్లనియె.

"మనవీరుల సారాసారంబులు విమర్శించి, తత్తదర్హసంభావనంబుల గౌరవింపవలయు. దానంజేసి, యుత్సాహసాహసంబు లినుమడించి ప్రాణము లైన ఱాఁపక పోరుదురు. దానముకంటెను సన్నా

వంటె చేయుమనుంగు లెక్కఁడు; సన్మానంబె సర్వార్థసాధకము. దక్షు లగు భృత్యుల యథార్హసంభావనములందనుపడికొంటె రాజులకొవ్వది వేఱు లేదు. కాఁబట్టి నావలుకల వద్దచేయక, యాదరింపవలయును.” అనిన, హిరణ్యగర్భుండును మనమున గడుసలరి నిజసైనిక నికరముల రావించి, బహూకరించి, యుత్సాహం బెక్కించి, దురమునకుం బురి కొల్పె. అంత దూరదృశ్యమాన వైరివాహినీసందోహముం గాంచి, మించిపోయినట్లు వఱితెంచి, నీలవర్ణుండు రాజునకు నమస్కరించి, యిట్లనియె. “దేవా! సేవకుని గృపాకింకరం బగు కటాక్షాంకురంబున వీక్షించి, యీచిన్నవిన్నపం బవధరింపవలయు. నామాట యనదుగాఁ జూడ వలదు. అల్లదె ప్రత్యర్థి యుద్ధార్థియై దుర్గద్వారమువలనికిం డాయుచున్నవాఁడు. ఆతండు మనదుర్గనిర్గమమార్గం బవరోధించెనేని, మనమెల్లఁ గాళ్ళు తెగినపగిది నిందుండి పేరులేక క్రుందవలసి వచ్చును. పనుపవచ్చును రాదనుశంక మాని, నన్ను నీయిచ్చవచ్చినపనికిం బుచ్చుము. స్వామియాదేశం బయ్యెనేనిఁ, గోరికిం దారసించిన యీ శారికావారమ్ములను గీరమ్ములను నే నొకచీరికిం గొనను. ఇవి గరువమున నాడు కండకావరపుమాట లని తలంపకుము. నేఁ బ్రథనమునకుం జొచ్చినఁ, జచ్చియు విచ్చియు నరాతు లెట్లు యథాయథలయ్యెదరో కనుంగొనుము. స్వామి నాకింతవట్టు మన్నన యీవలయు, దేవరఋణంబెల్ల వడ్డితోడఁగూడ నేఁడయ్యాముష్కరులచేఁ గ్రక్కించి, స్వామిఋణమువలన విముక్తుండ నయ్యెద. అంగీకారసూచకముగా నొకమాఱు భ్రూవల్లరి నించుక యల్లార్చుము.” అనిన, మొగంబున నవ్వుగానినవ్వు నవ్వి, కోకలోకాధ్యక్షుండు రూక్షేక్షణంబుల నధిక్షేపించుచుఁ, గాకి కిట్లనియె. ‘ఓ నాను: నీవన్నిటికిం జాలుదువు. అయాన ముడిగి, యింతటితో మిన్నకుండుము.

కృత్యాకృత్యపరిజ్ఞానంబు లేక, యూరక త్రుళ్ళుటయే కాని, బుద్ధి యావంతయు నెఱుఁగవు. నీ వెప్పుడుం బోరు పోరసియే పలువరించుచుందువు. నేఁటి కది తలకూడినది. నీవే నిష్కారణముగా నీవైరంబుఁ బెంచితివి. దీన మాకుం దెలుపకుండఁగూడఁ బ్రళయంబు సంభవించుంగాని, నీయొక్కనితోడం బోవదు. అయోధులగు మానుసులిండ్లకడ నెన్నియైన బీరంబులు పలుకుదురుగాని, మాకుతుండు దారపంబై యీరనంబునం బోరునప్పుడు వారి సక్కిళ్ళుపడుదురు. నాహితవచనంబు లవజ్ఞతగా నెక్కించుకోక, నీపోకడమూలినతనంబుఁ గట్టిపెట్టి, సాధుసమ్మతుండ వగుము.” అని, రాజహంసక మరలి “స్వామీ! యీకజ్జలాని వృథాజల్పంబులు నిక్కంబులుగా నగిచి, మానప్రాణంబులఁ గోలుపోవుట మేలుగాదు. వీఁడు గడుఁగ్రొవ్వి, నోరికివచ్చినట్లెల్ల వెదయఱవు లఱచుచున్నవాఁడు గాని, లేశంబును గార్యంబుఁ గానఁడు. కర మారసిచూడ, వీఁడు మిత్రవ్యపదేశంబునం బగఁగు శత్రుండు. నీకుఁ గల వివేక మంతయు నివు దేయూ?కిఁ బోయె! మాయికుల కెందును మాయవృథంగులే మందు గాని, ఋజుమార్గంబులు కొఱగావు. నీవార్యవృత్తంబునకుం జొచ్చి, యీతని కుపష్కపచారంబులు కమతీవులుగా సఖివర్ణించెదవు. ఈదురాత్మునిదౌర్మంత్ర్యంబు చెవి నిడఁగూడ దను తలం పించుకయు నీబుద్ధికిం బుట్టదయ్యెను. మనయోధులు దుర్గంబు నిర్గమింతురేని, దుర్గాశ్రయణంబెల్ల నిష్ప్రయోజనంబై చెల్లును. అందులకై మనపడ్డప్రయాసపాటును నిష్ఫలం బగును. నీళ్ళలోనుండి యేనుంగుఁ బీనుఁగు గావింపఁజాలు నక్రంబు, బయటిభవనంబుచే భంగపడుట స్థానభ్రంశదౌర్బల్యంబునం గాదే! దుర్గంబు వెలువడునేనిం జివ్వాలో మనగువ్వలు గవ్యాకుం గొఱగావు: అనుకూలకర్గుం డగు నీలవర్ణుని చెఱుఁ గెలువులు

వీనుల కమృతకల్పంబులయి, మతికి హితంబులుగాఁ దోఁచుచున్నవి. మనవారికిం గాలంబు చేరు వాటం గాఁబోలు, నీమొదటిమాటకపుమాటలు వాటంబులుగా నాటుకొనియెడిని" అని మఱియు నేమో యనఁబోవుమంత్రిమాటల కడ్డంబు వచ్చి, హిరణ్యగర్భుండు తన నమ్మకపుటురిం దగులుట భావించి, వర్ధిష్యమాణరోషుం డయి కరటేంద్రుం డిట్లనియె. "ఓమహారాజా! నామాటలు బోటు సేయక, దేవర దివ్యచిత్తంబున నవధరింపవలయు. ఈసర్వజ్ఞుండు మేఁకవన్నెపులి. మన కవమానంబు వాటిల్లినను, దనప్రాణముల దాఁచికొనవేఁడి, యిప్పు డిన్నిపోకలం బోవుచున్నవాఁడు. ఈకేఁడు మనకడ, నుత్సంగంబున నాశీవిషం బున్నట్టున్నవాఁడు. స్వకార్యైకధురంధరు లగు నేతాదృశమిత్రుల దూరంబున విసర్జించుట కర్జంబు. ఈతండు పోరికి రాకుండుటయె యుఱవు. ఈతం డొక్కఁడు లేకున్నను, మన కొక్కకొఱఁత రాఁబోదు. సన్నెకలు దాఁచినంతనె పెండ్లి చిక్కునా? దేవర ముందఱ బంతంబులు పలుకరాదుగాని, యెవ్వరు నేల? నీకుం గెలుపొనంగ నే నొక్కరుండఁ జాలుదును. నాయుత్కర్షంబు చూడఁజాలక, మీఁదుమిక్కిలి నాపై నొక్కదోషము నారోపించి, దూఱనాడుచున్నవాఁడు. ఓహో! వీనుల కెంత రోఁత విలవలసి వచ్చెను! నిక్కంబు విచారింప, నివి యన్నియు నన్నాప్తుఁ డని మన్నించుదేవర నంట గాక, నన్నుటయె? ఈతని బోఁటిబంట్ల కెట్లయిన నగుఁగాని, శరీరంబునఁ బిఱికికండ లేనిబిరుదు మగలకుఁ బ్రాణంబు మానంబుకంటెను పెద్దకాదు; మానమే ప్రాణాధికంబు. కావున, లోకమున మానధనులు మానహీనమయిన బ్రదుకు నొల్లరు. ప్రాణంబులనైన విడువనోపుదుంగాని, మానంబు పేటిబుచ్చి లోకంబున భీరు వను పడి వడంజాలను. కుండ మూఁడు

మ్మని పెద్దలు చెప్పుదురు. ఎంత చెప్పినం, దనమార్గంబు మానక, మన తేఁడు తాను బట్టినపిట్టకు నాలుగుకాళ్ళే యనుచున్నవాఁడు. మన కాడిక రాకుండఁ, జేతకయినంతవఱకు మనము నిలిపిచూచితిమి. మీఁద నీశ్వరసంఘటనం బెటులుండె నటులకాకమానదు. మనకుఁ గాలంబును గర్మంబును బ్రతికూలంబు లయియుండ, నాతనికి మంచి బుద్ధి యెట్టువుట్టును? మనరాజునకుఁ గ్రొత్తవారే పెద్దయిష్టులు; మనమే లాఁతివారము.” అనుచుండ, యనతిదూరవర్తి యగుచక్రాంగ చక్రవర్తిం గాంచి, యొండొరుల నవలోకనసంజ్ఞల వాఁడుచుకొనుచు, రణసంభ్రమంబునం బరిభ్రమించు చుండిరి. అంత మరాళకులాధ్యక్షుండు, నిజబలక్షపక్షవిక్షేపణ జాతవాత వేగసముద్ధూత పాంసుజాలంబు భూనభోంతరాళంబుం దిరోహించి యంతరిక్షంబలక్షితంబుగాఁ జేయు దురాగ్రహాగ్రహావేశంబున నొడ లెఱుంగక, సమగ్రసన్నాహంబున, నుత్సాహం బెసంగఁ జనుదెంచి, యుంగలమ్ముల లోలుకునపాంగమ్ముల వైరివీరుల నీక్షించుచు, మొనవెనుకం బొలిచి నిలిచె. అప్పుడు హిరణ్యగర్భవాహిని సందోహంబు లన్యోన్యాహ్వాన వాదంబులును సింహనాదంబులును రోదసీకుహరంబుల నిండ వైరివీరులం దలపడి, ఘోరాఘోరంబు బోరిన, సంగ్రామం బుద్దామంబుగాఁ జెలఁగె. అందు దీర్ఘముఖాదులు తొంటిపగకై ప్రాణంబులకుఁ దెగించి, రోషావేశ వివశులయి రిపుసేనఁ బాయువడం జొచ్చి, దారుణంబు లగుత్రోటి విదారణంబులను, నత్యంతకఠినపాతంబు లగు చరణనఖాఘాతంబులను, నతిఘాతుల నొప్పించి, యద్భుతరసావహంబుగా మహాహవం బొనరించినఁ గించిదవశిష్టంబుగా నరాతిచమూసమూహంబు నష్టంబునొందె. అప్పు డప్పతంగకులదారుణ మరణంబుఁ (దానును బతింబొంటె కావఁ) జూడ నోపక యాతోటు వాసి చనియెనో యనఁ బ్రభా

కరుండు ప్రథమ మొదలి పడమటికడలికడకు నడచి, మఱుఁగుపడియె. ఆమునిమాపున నిరువాఁగుల పడవాళ్లును నాఁటికి బవరంబు చాలించి, తమతమబలంబులం దివిచికొని వీళ్ళు సేరిరి.

అట్లరిగి, యారాత్రి సుఖనిద్ర చేసి, మఱునాఁడు రేపకడ నుభయవాహినీపతులును నహర్ముఖోచితకృత్యంబులు నిర్వర్తించిన పిమ్మటఁ దమతమబలంబులఁ గలని కాయితంబు చేసి, పురికొల్పిన, నవి యనల్పక్రోధంబున నభ్యర్ణపూర్ణచంద్రోదయ ఘూర్ణమానార్ణవంబులభంగిఁ బొంగి, యొండొంటిం దలకడచి తాఁకి, ఘోరంబుగాఁ బోరుచుండ. ఆభీమసంగ్రామంబునఁ బ్రొద్దు పొడవకమున్న వచ్చియున్న మేఘవర్ణుండు, హిరణ్యగర్భరాజ్యగర్వాంధకారవినాశసూచకోల్కా నానోల్కాజ్వలత్కాష్ఠంబు ముక్కునం గఱచికొని కపటపలాయనంబు నటించుచుఁ, దనవారు వేవురు వెంటనంటిరా దుర్గం బనర్గళరయంబునం జొచ్చి, చిచ్చింటింటం దరికొల్పి, చట్టుపల విసరుదుం బ్రజ్వలితశిఖుం డగుసమీరణసఖుండు, కరాళజ్వాలికాజాలంబుల దశదిశలం బఱపి, దుర్గంబెల్ల నాక్రమించిన, బహువిహంగంబులు విహాయసంబున కెగసి, పక్షంబులు కమలిన సుడివడుచు ముడింగిపడి, హుతాశనున కశనంబు లయ్యె. కల్పాంతకల్పం బగుననలవిహారంబునకుఁ దలంకి, హతశేషము లయినపక్షు లంతరిక్షంబున కెగయ గమకింపఁ, బోసిక కాకులెల్లం బొదివి త్రోటిఘాతమ్ములఁ జరణప్రహారమ్ములఁ దద్విహంగఘాటమ్ముల నిరాఘాటమ్ముగఁ గెడపి, పుడమికిం బలిచేసి 'దుర్గంబుపట్టువడెఁబట్టువడె' నని యార్చి పేర్చిన కోలాహలము రోదోంతరాళము నిండిన, కెందువడి విమతకృతం బగుపావకోపప్లవంబునకు వగచి; లోనినగౌకములు కాందిశీకము లయి, యాహవమున కోహటించిపాఱి, కంఠగతజీవనము లగుచు జలంబులం బడి, తమప్రాణముల

దక్కించుకొనిరి. తక్కిన కొన్ని స్వభావమునకు భయము తోడ్పడ గుండియలు జల్లుమని, కళ్లువడి, యేగఁ గాళ్లురాక, పగతురచరణ నఖాఘాతనిపాతితములై, ప్రపన్నిర్ఘరము లగుగోత్రములం బోలె, నెత్తురువఱదలు వాఱుగాత్రములు మెఱయ, నిశ్చేతనము లయ్యెను. అట్లు క్షణమాత్రమున దుర్గం బెల్ల మల్లెపట్టినపొలముచందం బగుట విని, బయటివారును వెఱవేకిఁగొని, కాలుచే యాడక, పిడు గడిచిన వడువునఁ గూలఁబడి బిమ్మిటి గొనియుండ, నేమఱుపాటునం జుట్టు ముట్టి, పరబలము లసంఖ్యములు నిశితముఖము లగు నఖములం గ్రుచ్చి, నిర్ఘాతపాతములంబోని తుండాఘాతముల నొప్పించిన, నిలువున విగతాసువులై రక్తసిక్తాంగంబులతో రణాంగణం బలంకరించిరి. కొందఱు రణభీరువులు రాజాం బగవారినడుమ దిగవిడచి, నిలిచినచోట నిలువక, చూచినవంకం జూడక, కెళవుల కుతికి, యొకఁడు పోయిన త్రోవ నొకఁడు పోవక, చెట్టొకఁడుగా నొదిఁగిరి. మఱికొందఱు కాలుతక్కువవారు పాఱంజాలక వెనుకచిక్కి, విరోధియోధచరణ ప్రహారమూర్ఛాపరవశులై, త్రోటిభేదనముల సంధులు ప్రిదుల మురిసి వ్రాలిరి.

ఇట్లు నిహన్యమానము లగుసైన్యములు నిలువఁజాలక, దైన్యమునఁ జెల్లాచెదరై పఱచిన, నాయాపత్కాలమున రాజహం సము స్వభావమందగతి యగుట నబ్బారి గడవనేరక, సారసద్వితీయం బై యుండి, పొరలి పొరలి వచ్చుకన్నీటివఱదం దనధైర్యసేతువున నుడువుచు, సేనానిదిక్కు మొగం బయి యిట్లనియె. 'వీరవరా! చూచితివిగదా, నానిమిత్తమున మనవారల కెందఱ కిట్లు ప్రాణాంత కారియైన యాపద సంప్రాప్తమయ్యెనో? వారందఱవిక్రమము లిఁక జనము లద్భుతములుగాఁ జెప్పుకొందురు. తుగతియకు సిద్ధుని

నేను నూపిరితో నున్నారము. ఉత్తరక్షణమున నెట్లయ్యెడదో తెలియదు. నాకై యంతలేసివార లట్లు కాఁగా, నింక నీపాడుశరీరమా నన్ను రక్షించునది? ఈనీలవర్ణుని నమ్ముటఁగదా, కార్యమింత మోస మయ్యెను. ఆమాయమాటలు చూచి, యీతఁడేమో విశ్వాసపాత్రుం డని భ్రాంతిపడి, తప్పుచేసి యీగతిఁ దెచ్చుకొంటిని. కడ కీదురాత్ముండు నమ్మించి భంగపఱచెను. అప్పుడీతనిఁ జేరదీయవలదని మీరెంద ఱెంద ఱెన్నెన్నివిధములనో నూఱి పోసితిరి. ఏమికాలకర్మదోషమో యప్పు డావచనము లేమియు నాచెవికిం జవి గావయ్యెను. అప్పటి నాడెందంబు చందంబు తలంప, నిపుడు నాకే విస్మయ మగుచున్నది. విధి మూఁడిన వానికి హితులవాక్యము లెట్లు రుచించును? మీరెల్లరు వలదువలదని వేవిధములఁ జెప్పినఁ, జెవిని బెట్టక యాకట్టిడికాఁని గోరి తెచ్చుకొన్న నాపాపఫలం బనుభవింపకతీఱునే? ఇంతకును దైవసంకల్పం బిట్లుండఁ, బౌరుషం బేమి సేయనోపును? హా! దైవకృత మే మనవచ్చును! నాఁడట్లు వేవు రెప్పుడు నోలసి కొలువ వెలయునాకుఁ, బిలిచిన నో యనువాఁడును లేకుండఁ జేసె. వారందఱు ముందుగాఁ ద్రోవ తీసిరి; ఇఁక నెక్కువ తక్కువగా మనము నాదారినే వారిఁ జేర నున్నారము. మనసర్వజ్ఞుం డాడినమాట లన్నియు నేఁడు తథ్యంబు లయినవి. అతండు తలంప నీలోకములోనివాఁడే? ఇఁక నాతనివిషయమై యెట్టి పాపపుమాట చెవిని బడునో? నీవు నాకుం గూర్తువేని, యాలోనన చని, యొక్కయుపకారము చేయుము. దైవోపహతుండ నగునన్ను రక్షింపఁ బూను నీయుక్తికో లెల్లను విఫలము గానేరదు. నేఁటితో నాయాస విడిచిపెట్టి, నాకడంక కడ్డకా ల్వేయక, మదీప్సితంబుఁ దుద ముట్టించి, కృతకృత్యుండ వగుము. నీవు వేగమ పోయి చొచ్చి సర్వ

జ్ఞానమతంబున మత్పుత్రుఁ జూడాకర్ణు విహంగరాజ్యంబున కభిషిక్తుం గావించి, యాశుభవార్త దెచ్చి నాచెవిని వేయుము. అతఁడైనఁ బ్రాణములతోడ నుండి రెక్కలెనా మనయాపగ నెన్నటికైన నీఁగఁ గలవాఁడు. దైవంబు మనలసిద్ధులఁ దిన్నఁగాఁ జూచినఁ, బునర్దర్శనం బయ్యెడును. లేదా, యింతే మనయదృష్ట మనుకొని, యిదే కడసారి చూపనుకొమ్ము; పొమ్ము" అను తేనివచనములు కర్ణశూలాయమానంబులయి హృదయంబుఁ గలంచినఁ, గొంతవడి దిగ్భ్రాంతి పడి, యతిప్రయత్నంబునం దెలిసి, గ్రుడ్లనీరు గ్రుక్కుకొనుచు, నలుంగు గద్గదికం దగులువడ నిట్లనియె. "దేవా! యిట్టి దుస్సహవచనంబులు దేవరనోర వెడలఁదగవు. 'చూడాకర్ణుని విహగరాజ్యంబున కభిషిక్తుం జేయుమని యెంతమా టానతిచ్చిరి! ఆచంద్రతారార్కంబుగ నీసర్వంసహాచక్రంబు సర్వంబును దేవరవారే యేలవలెను. నేను సేనానినై యుండ, దేవర నెవ్వరైనఁ, జుట్టనవ్రేలఁ జూపనోవుదురే? వేయేల? మదీయ మాంసాసృగ్విలిప్తమార్గంబునం గాని, దాయ కేలిన వారి దాయఁదలకూడదు. క్షమావంతుండును, దాతయు, గుణగ్రాహియు నగుదొర దొరకుట, మహాభాగ్యంబునంగాని కలుగదు. శుచియు, దక్షుండును, ననురక్తుండును నగుభృత్యుఁ డొదవుటయు దుర్లభంబె. అట్లు భాగ్యవశంబున లభ్యం బైనప్రభురత్నంబు నట్టి మందభాగ్యుఁ డైనఁ బెడవాయఁ జూచునె? నాకు స్వామితోడిద లోకంబు; దేవరచరణంబు లెడవాసి క్షణంబును మననేర. ఎంతటి వాఁడును మృత్యువుఁ గనుఁగ్రామలేఁడు. ఎన్నటికైన నీదేహంబు నేలపాలు గావలసినదే. అస్థిరం బగుశరీరంబునకై సుస్థిరం బగుకీర్తిం గోలుపోనేల? భృత్యుఁడు స్వామికార్యపాత్రప్రాణుఁ డయ్యెనేని, బుణ్యలోకంబులు చూరగొనునని యార్యు లందురు. ఎప్పుడైన

విడువవలయునీశరీరంబు, నిప్పుడు విడుచుటయేమి భారము? స్వామ్యర్థపరిత్యక్తజీవుఁడనై సుకృతి నగుదును. సంపదలు గజకర్ణాంతవిలోలంబులు ; తనువులో, శరన్మేఘతటిత్తరళంబులు ; ఇఁకఁ దారుణ్యమందుమా, వారితరంగచంచలంబు; నిన్నఁ జూచినవాఁడు నేఁడు గానరాఁడు. ఉన్నను జన్నను, కీర్తిమాత్రము పోక నిలుచును. దేవర వారు సర్వథా రక్షణీయులు; సప్తాంగములలోఁ బ్రధానాంగము రాజు; ప్రకృతివర్గం బెంత బలవంతం బయ్యును రాజవిహీనంబై జీవింపనేరదు. ధన్వంతరి వైద్యుఁడైన, నాయువు మూఁడినవాని నేమి సేయనోపును? అంభోజంబుంబోలె, నినునియభ్యుదయసంక్షయంబుల లోకంబంతయు వికాససంకోచంబులం బొరయుచుండును.'' అనునంతలోఁ జిత్రవర్ణుని సేనాపతి తామ్రచూడుఁడు తనపుంజపోఁతుతో రాజహంసనుహింసించు తలంపునం దారసించె.

అప్పుడు కుక్కుటమరాళంబులకు దారుణప్రవిదారణం బొదవి, పొదలుమదంబులం బొదివి పరస్పరజయకాంక్షలం బోరుచుఁ, బిఱిందికిం జరగి మరల నురుదెంచి యెగిరి చరణంబుల నొండొరుల నదరంటం జుఱుచుచు, నఱచుచుం బఱతెంచి చంచువు చంచువునం గఱచి యితరేతరాకర్షణంబుల మించి మేనులు చించుచు, వాఁడిగోళ్ళొడళ్ళ గాఁడఁ దాఁచుచు, నెత్తురులం జొత్తిల్లి, ఱెక్కలుగల మలలమాడ్కి నింగి కెగసి వక్షంబులు ప్రక్షతంబులు చేసిన బోరనం గారుధారాళరుధిరాసారపూరంబు ధారాధరనిపతితవర్షబిందుసందోహంబు ననుకరింప, నొండొరువులకు వ్రటపడక పెద్దతడవు పెనంగి, ధరణీతలంబునకు లంఘించి కొంతసేపీడంబోక పోరాడి యంతకంతకుఁ బరిశ్రాంతసత్త్వుఁడగుచు వచ్చునంచలఱేనిం గని సత్త్వాధికుం డగుకృకవాకువల్లభుండు మేలు చేయియయి, మెఱుఁగు మెఱసిన తెఱఁగున హిరణ్య

గర్భమీఁది కుటికి మొఱకల శిరమ్ము మోఁదిన, నమ్మోఁదునకుం బెను ముంగలివాఁడినగవృశ్చికమ్మోలె మనం బెరియింప, నటాసముత్పాటన కుపితం బగు కంఠీరవంబు నేవునఁ గోపంబు ముప్పిరిగొనఁ దఱివారిఁ గొండఱం బోరిగొని, యంతలోఁ జరణాయుధంబు క్రమ్మఱఁ దన్నిన ప్రముగ్గతిలి, దిగ్గన సంబళించుకొని లేచి, భ్రుకుటీప్రకటీకృతరోషుం డయి, కడంకలు నుడివడఁ గడిమి పెంపు వోనాడి, దండతాడితదర్వీ కరంబునోజ రోఁజుచు, శ్రమంబునం డీలుపడియుండ, వీక్షించి సార సాధ్వత్తుండు వీరవరుండు రోషానూయావిలమానసుండై కడంగి, యురగకుఁ బుబుసెకుమారుఁ డాశనిపై నిడించునుం గదిసి నిజఖరతర నఖరప్రహారంబులఁ జరణాయుధంబు నెట్టకేలకు ధరణిఁ గూలఁజేసి, బాపట మై దారిచేసిన దెఱపి గాంచి యాయుంచలరాయుండు వెఱపిల్లునం బ్రాణార్తుండయి పాఱి, నీరంబులం దూఱె. అట్లు తమయుద్యమం బెల్ల వీనరపోవుటయుఁ, బృతనాపతి నిహతుండగుటయు, నీక్షించి విపక్షిపక్షులెల్లఁ గోపాటోపంబునం జుట్టుముట్టిన, సరకుసేయక యాసారసకల్లజుండు సంవర్తవేళాప్రవర్తిత దారుణసంహారవిహారుం డగు మూఱట సమవర్తియుంబలె నుదగ్రమహోగ్రహావ్యగుండయి, యనేక శకుంతంబుల నంతకాంతికంబున కంపి, చూప ఱగ్గింపఁ జిత్ర వర్ణవాహిని నేటికెను రీఁదిపట్లు వీరవిహారంబు సలిపి, విపక్షమర్ది రీక్షుండయి, రణక్షోణి యెల్ల నిపతితసామాంసభారంబు లగు శోణిత పూరంబులు వఱపి, మఱియు బిఱువోవక జముఁ దాడించు జంత్రపు బొమ్మలట్లు పయిపయిం గవియు పింగళి బలంబులఁ బీనుంగుపెంటలు గావించి, మాఱులేక మలయుచుండ, హతశేషపక్షికులంబు వికలం బయి విఱిగి మరగి తనమఱుఁగుఁ జొచ్చుటయుఁ, గేకినాయకుం డక్ష దలం బెల్లఁ గ్రొవ్విమృతంబులు మృతకల్పంబులు నై యున్న స్వకీ

యానీకినీజనంబులకు విచారపడి, సేనలం బురికొల్పి, యొక్కపెట్టఁ దానును సమాత్యుండును జెగ్గురుపయిం బడి బడలించినఁ, దేవదత్తుఁ గియుఁ బౌరుషంబు వాటించి, శాత్రవసహస్రంబులం దునిమి, విగత సత్త్వుం డయి తూఁగాడుచు నరగన్ను వెట్టి, కొఱప్రాణంబులతో వీర వరుం డుండ, శిఖండీంద్రుండు పురివిచ్చి వచ్చి యాత్మపతత్త్రకోటి ప్రహారణమ్ముల మొత్తిన, వికృతంబుగా నొఱలుచు విగతజీవుండయి వీరశయనంబున శయనించె. అది చూచి చిత్రవర్ణుం డమందానంద మునం బొదలి, సింహనాదంబు చేసె.

ఇట్లు చిత్రవర్ణుండు విజయోల్లాసభాసురుండయి, యరిదుర్గంబుఁ బ్రవేశించి, రాచనగరు లెల్లఁ గొల్లగొని, యుల్లంబుల వెల్లివిరియు నంత వంబు మొగంబునం బ్రబ్బ యుబ్బి, జయజయశబ్దంబులు భూనభోం తరంబు నిండ, నిజామాత్యభృత్యవర్గంబులం దోడుకొని, నిత్యప్రయా ణంబుల నిజరాజధానిం జేరి, యత్యంతయత్నలబ్ధం బయిన విజయంబు సార్థకంబుగా నపారసంతోషంబున వసుంధరాపాలనంబు సేయుచు సుఖముండె.

అని విష్ణుశర్మ విగ్రహము సమగ్రముగా ననుగ్రహించి, ప్రజాక్షయకారణం బగు రణంబునకుఁ గాలు ద్రవ్వక, నొవ్వక, మీరును నేటిమీఁదఁ బ్రజాపాలనంబు సలుపుం డనిన, రాజపుత్రు లింతంతనరాని సంతసంబునం బొదలి విష్ణుశర్మను బహుభంగులం గొనియాడిరి.

ద్వితీయభాగము ముగిసెను.

విగ్రహము సంపూర్ణము.

# నీతిచంద్రిక - సంధి

రచయిత

కందుకూరి వీరేశలింగము

( 6వ కూర్పు )



ప్రకాశకులు

హితకారిణీసమాజము

రాజమహేంద్రవరము.



0-12-0

# పీఠిక

శ్రీకరు నవ్యయు నాద్యున్
లోకచయావనశీలున్
శోకవిశోషణు నీశున్
బ్రాకటభక్తిని గొల్తున్.

ఆంధ్రభాషను బద్యకావ్యములు పెక్కు
మున్ను లోకోపకారంబుగ రచించి
నట్టి నన్నయాదుల నెదయందుఁ గొలిచి
వచనకావ్యంబులను వ్రాయువారిఁ దలఁతు.

ఇంతకు మున్ను నేను రచియించిన విగ్రహతంత్ర మెల్లచో
నెంతయుఁ గష్టశైలి రచియింపఁగఁబడ్డ దటంచుఁ బల్కుటన్
వింతగ నాకు లేఖలను బెక్కురు వ్రాయుచునుంటఁ జేసి య
త్యంతము వ్రాసితిన్ సులభమౌగతి దీనిని సంధితంత్రమున్.

పలుమఱు హితోపదేశంబు భారతమును
పంచతంత్రంబుఁ బరికించి, వానిలోన
వలయు కథలను గొని దీని వ్రాసినాఁడఁ
గ్రొత్తగాఁ గొంత యందంబుఁ గుదురుపఱచి.

పెద్దల వేఁడెద దీనన్
దిద్దఁగ దోషము లున్నన్
విద్దియ చాలని నన్నున్
దద్దయుఁ గూర్మి క్షమింపన్.

శ్రీరస్తు

# నీతిచంద్రిక

## విగ్రహతంత్రముయొక్క కథాసంగ్రహము.

కర్పూరద్వీపమునకు హిరణ్యగర్భుం డను మరాళశ్రేష్ఠుఁడు రాజుగా నుండెను. ఆతని భృత్యుఁడగు దీర్ఘముఖుం డను బకంబు సమస్త దేశములం గల విశేషవిషయములను జూడవలె నను నభిలాషతో బహు దేశములు తిరిగి కడకు జంబూద్వీపమునకు వచ్చి యచ్చటియరణ్యములో సంచరించుచున్న తద్ద్వీపాధినాథుఁ డగు చిత్రవర్ణుం డను మయూరరాజు పరిచరులం గాంచి, వారితోఁ గొంతతడవు సరససల్లాపంబులు జరపెను. అప్పుడు వారు ప్రసంగవశంబున మనదీవుల రాజు లిద్దఱిలో నెవ్వఁడు ఘనుఁ డని దీర్ఘముఖుని నడిగిరి. హిరణ్యగర్భుఁడే సర్వవిధముల నుత్తముఁ డని సంకోచింపక దీర్ఘముఖుఁడు మాఱుపలికెను. ఆ మాటలకుఁ గోపమువచ్చి యాదీవిపక్షులు దీర్ఘముఖునిం బలువిధముల దూషించుచు, మాదేశమునం గ్రుమ్మరుచు మారాజునే నిందించెదవా యని యాతనిని రెండుఱెక్కలు విఱిచికట్టి తమయేలికపాలికిం గొనిపోయి నడచిన సర్వవృత్తాంతమును నివేదించెను. అప్పు డాసభలోఁ గూరుచుండి యున్న యరుణముఖుఁ డను కీరము తనరాజుఁ జూచి, కర్పూరద్వీపము మొదలుగాఁ గలవి జంబూద్వీపములోనివే కాఁబట్టి యాదీవియు దేవరపాలనంబునకు లోఁబడినదే యనియు, ఈహంసుఁడు మొదలుకొని యేఁటేఁటఁ గప్పము కట్ట హిరణ్యగర్భునికిఁ జెప్పి పంపవలయు ననియు, విన్నపము చేసెను. అందునకు రా జౌ నౌ నని తల యూఁచి, ముందుగాఁ బోయి యావార్త నీస్వామి కెఱిఁగింపు మని దీర్ఘముఖుని విడిచిపుచ్చి, తరువాత నరుణముఖునినే దూతగా హంసస్వామికడకుం బంపెను. ఈలోపలనె చిత్రవర్ణునిమంత్రి దూరదర్శి యను గృధ్రము రహస్యముగా రాజుతో నాలోచించి మేఘవర్ణుం,

డను కాకమును రావించి యాతని కెఱిఁగింపవలయు నర్థం బెఱిఁగించి, హిరణ్యగర్భుని మాయోపాయంబునఁ బరాభవించుటకయి పంపెను. ఆకాకియు మేఘవర్ణుం డని పేరుపెట్టుకొని సింహళద్వీపమునుండి వచ్చితి నని బొంకి, తేనెమాటలు పెక్కులు పలికి హిరణ్యగర్భుని యనుగ్రహంబు వడసి, యాతనికొలువునం గరముఁ జనువరి యయి యుండెను. అప్పుడు మరాళవల్లభుని మంత్రి సర్వజ్ఞుం డను చక్రవాకము జంబూద్వీపమున సర్వసంగతులును దీర్ఘముఖునివలన నదివఱకే వినియుండుటం జేసి, యీకాకమును జేరఁదీయవల దని తనరాజున కనేకవిధంబుల బోధించెను గాని, యాతనివాక్యము లన్నియు వ్యర్థము లాయెను. ఇంతలో జంబూద్వీపమునుండి యాణముఖుండు వచ్చి తనరాజు చెప్పిన మాటలన్నియు హిరణ్యగర్భుని సభలో వాక్రుచ్చి, యంచలరాయని యభిప్రాయం బెఱింగి నిజదేశంబున కరిగెను. తోడనే సర్వజ్ఞుండు వీరవరుం డను సారసశ్రేష్ఠుం బిలిపించి యాతనిచే నొకదుర్గంబు నిర్మింపించి, దుర్గపాలనాధికారంబును నాతనికే యొసంగి, శత్రువార్తలు గుప్తప్రకారంబునఁ దెల్పుటకయి దీర్ఘముఖుఁ డనువాని ధవళాంగునిఁ దోడిచ్చి విరోధిపట్టణంబున కంపెను. అంతఁ జిత్రవర్ణుండు వాహినులతోడ వెడలి కొన్నిదినంబులు మార్గము చేసి మేఘవర్ణుఁడు చేసిన మోసముచే జయము గాంచెను కాని తన సేనాధిపతి యగు తామ్రచూడుఁ డను కుక్కుటమును నక్కఱం దుపిసలను గోలుపోయెను. మేఘవర్ణుఁడు దుర్గంబున నగ్గిపెట్టిన యనంతరంబున హిరణ్యగర్భుండు శత్రువులచేఁ జుట్టుకోఁబడి తన సేనాని యగు సారసుని సాహాయ్యంబునఁ బ్రాణంబులు దక్కించుకొని జలంబులం జొచ్చెను. సారసరాజును స్వామ్యర్థపరిత్యక్తదేహుం డయి లోకాంతరగతుం డయ్యెను. అప్పుడు చిత్రవర్ణుడు విరోధిపట్టణంబుఁ జూఱకొని హతశేషసైనికనికరంబులతో నిజదేశంబునకుం జనియెను.

శ్రీరస్తు

# నీతిచంద్రిక

## సంధి

తదనంతర మా నరవరకుమారు లా ధరణీసుర ప్రవరున కిట్లనిరి; "స్వామీ! మీ యనుగ్రహంబునఁ, విగ్రహమును సమగ్రముగా నాకర్ణించితిమి. దయచేసి యింక సంధిని సహితము ప్రసాదించి మాకుఁ గర్ణరసాయనంబు గావింపుఁడు. అనవుడు నభ్యస్త సమస్త నీతిశాస్త్రమర్ముం డగు విష్ణుశర్ముం డిట్లని చెప్పం దొడంగె:—

అస్మాకీన మహాసంగ్రామంబున నిహతానేకసైనికలోకంబు లగు మయూరమానసౌకంబులకు గృధ్రచక్రవాకంబులచే క్షణమాత్రంబున సంధి చేయఁబడియె. ఆవిధంబు వివరించెద వినుండు.

ఆరీతిని దారుణం బగు ప్రవిదారణంబున వీరవారం బెల్ల మారణంబు నొందినఁ జింతాక్రాంతస్వాంతుం డై వరటాకాంతుండు మంత్రిం జూచి, "సర్వజ్ఞా! ఎవ్వఁడు మన దుర్గంబున నగ్గి పెట్టిన దుష్టాత్ముఁడు? పగఱచేఁ బరికింపఁబడి యెవ్వరైన నిచ్ఛన్నవేషు లయి మనదుర్గంబు నివాసంబుగా నుండి మనల మోసపుచ్చి చిచ్చుంటించి పోరు గదా?" అనిన వినయావనతుం డయి చక్రవాక ప్రశస్తుం డిట్లనియె.

"దేవా! దేవరవారికి నిష్కారణబంధుండై యుండు నీలవర్ణుం డిప్పు డేమొకో సపరివారంబుగాఁ గానరాకున్నవాఁడు. నాకుం జూడ నిదియంతయు నావిశ్వాసఘాతుకుని విచేష్టితము యని తోఁచుచున్నది. దేవర యమాయకత్వమే దేవర నింతకుం దెచ్చినది. పుట్టుపూర్వము లను విచారింపక యవిశ్వసనీయు లగు నభినవాగతుల మీఁద స్వాధ

యంబు నిశ్చయంబు గావించి నమ్మిన పాపఫల మనుభవింప నేఁడు కాలము వచ్చినది." అనిన రాజును క్షణమాత్రంబు స్వాంతంబునఁ జింతించి, "ఇది యంతయు నాయదృష్టము. మాయదృష్ట మట్లుండఁగా నెవరి ననవలసిన పని యేమున్నది? ఈవిషయంబున దైవప్రాతికూల్య మొక్కటియె కాని మంత్రుల దోషంబు లేశంబును లేదు. మనుష్యప్రయత్నముచేఁ గార్య మెంత చక్కఁగా సంఘటింపఁబడినను, దైవయోగముచేతం జెడిపోవును. నిటలలిఖితాక్షరంబులు తుడిచి వేయ నెవ్వరిచే నగును!" అని యూరకుండెను.

అప్పుడు సవినయముగా మంత్రి యిట్లనియె, "లోకములోఁ బండితులు కానివారు తమ కొక్క విపత్తుదశ ప్రాప్తమయినప్పుడు, దైవమును గర్హింతురు; కాని, యాత్మకర్మదోషంబుల నెఱుంగఁజాలరు. అపథ్యానురాగు లగు రోగులలాగున నృపాలురును హితతంత్రు లగు మంత్రుల మతి నతిక్రమించి యాత్మవంచకు లగు యభినవప్రియులం బురస్కరించుకొని కార్యంబు ముగిసిన వెనుక గర్వము సర్వముం మాలి యదృష్టదదృష్టముం గాంచెదరు. సుహృదులును హితకాములును నగు సచివుల వాక్యంబు లాదరింపనివారు సహవాసి హితోపదేశంబు వినక చెడిన దీర్ఘసూత్రుం డను వినాశంబుతోడన వినాశంబు నొందుదురు. అక్కథ వక్కాణించెద నవధరింపుఁడు."

ఒక్క యేటిమడుగున దీర్ఘకాలమునుండి దీర్ఘదర్శి, ప్రాప్తకాలజ్ఞుఁడు, దీర్ఘసూత్రుఁడు, నని మత్స్యంబులు మూఁడు కూడి వసియించుచుండును. అట్లుండఁ గొండొకకాలంబునకు వేసవి సమీపించుడు, దీర్ఘదర్శి తక్కటిమీలఁ బిలిచి చేరఁజీరి యిట్లనియె:—"మిత్రులారా! మీరెల్లరుం జూచుచున్నారు గదా! అదినమున కాదినము వేసఁగి మిగుల నాసన్న మగుచున్నది. ముందు నిక్కముగా నీ ళ్ళిపురఁ [illegible] మన కొండొకచోటికిం బోవ శక్యముకాదు, కాఁబట్టి

యిప్పుడే యీయేటం బడి వెడలి యగాధజలంబును జలచరబాహుళ్యం బును నగు మఱియొక్కమడువుం జేరుదము." అనినం బ్రాప్తకాలజ్ఞుం డిట్లనియె: "భవిష్యదర్థంబునందుం బ్రమాణముం గానము; కాంబట్టి యె బుద్ధిమంతులగువా రెప్పటి కేది ప్రాప్తమగునో యప్పటికి దానికిం దగినట్లు కార్యము ననుష్ఠింపంజూతురు; కాని ముం దెప్పుడో యొప్పుమి రాంబోవు నని యిప్పుడే చింతింపను చిత్తవిచారంబు పెట్టుకొని కుందదు. ఇట్లీమడువు మహోన్నతంబు వదలుట నుండంగా నిప్పుడే యింతత్వరంత యేల? యంత పట్టినప్పుడు పోలిక తెలియంగు చూచుకొందము." అనిన దీర్ఘసూత్రుం డేమియు నాలోచన పాలుపోవక యూరకుండె. అంతయు న్విచారించి దీర్ఘదర్శి యింక నిందు నిలుచుట కార్యంబు కా దని మున్ముందె మెలంకువంబడి జలసమృద్ధం బగు మఱియొక్కమడు వుం బ్రవేశించె. అనంతరం గొన్నాళ్ళు గడచిన వెంటలు మెం డగుటం బూటపూటకు జలంబు లింకం జొచ్చిన, జాలరులు వచ్చి యూతలు, చిక్కములు, గాలపుట్టికలు మొదలగువానితోడ సరంబులం జొచ్చి, విషంబులం గల ఘుషంబుల నెల్లం బట్టి తాళ్ళం గ్రుచ్చుచుండ. ప్రాప్త కాలజ్ఞుం డొక్కవేర వూహించి యం దొక్కత్రాడు నోరం గఱచికొని గ్రుచ్చినట్టు లంటిపెట్టుకొని కుక్కిముక్కినక యుండెను. అప్పుడు దీర్ఘసూత్రుం డబ్బారిం గడచు నుపాయంబుం గానక యేమి చేయుదు నెందుం జొత్తు నని తత్తరించుచు నిందునందు మిట్టిమిట్టిపడుచు దుముకు లాడుచుండం జూచి యూకైవడ్డు లావాలుగను లగుడంబున నడిచి మడి యించిరి. అంత నాధీవరులు మీలవేటం జాలించి నాటిచరంబుల యొడళ్ళు నంటిన మంటిని గడుగ మీలగుముల జలంబుల జాడించు నప్పుడు మీనంబుల సందున నిరుదాడలం ద్రాడు గఱచిపట్టుకొని గిట్టినట్టులు కదలమెదలకున్న ప్రాప్తకాలజ్ఞుండు మెల్లగాం ద్రాడు విడిచి గంభీరవారం బ్రవేశించి ప్రాణత్రాణంబు కావించుకొనియె. కాంబట్టి

మిత్రుల హితవచనంబులు విననివాఁడు దీర్ఘసూత్రుని విధంబున నంతంబుఁ జెందును. మఱియు దీన నింకొక విశేషంబు గూడ గలదు. ముందుగా ననాగతములగు కార్యంబుల నూహించి మెలఁకువపడువాఁడు దీర్ఘదర్శివిధంబున నాపదం బొరయక సుఖించును; అప్పటికిం దోఁచినట్లు వెరవు పరికించి ధైర్యముతోఁ గార్యము నిర్వర్తింపఁజూచువాఁడు ప్రాప్తకాలజ్ఞుని తెఱంగునఁ బరమసంశయాస్పదం బయిన ప్రమదకుం గాంచును. భవిష్యదర్థంబును గానక సమయోచితం బగు నుపాయంబు తోఁచక యూరకుండువాఁడు దీర్ఘసూత్రుని కైవడిఁ దప్పక యప్పుడ ముప్పుఁ జెందును.

అనునప్పుడొప్పునివారి పేటఁ బట్టు వింతఁ బారసి రాఁ గన్నుఁ బంపఁబడిన ధవళాంగుండు చనుదెంచి యచలరాయనిం గాంచి నమస్కరించి యిట్లనియె: స్వామీ! ప్రతిక్షణంబును దుర్గశోధనంబు కర్తవ్యం బని మున్నే విన్నవించుకొని యున్నవాఁడను గదా? దేవర నా వచనంబులయెడ ననాదరంబు చేసి యూపనిం గావింప రైతిరి. అ క్లేమఱియుంటవలని ఫల మిప్పు డనుభూతంబైనది. గృధ్రానీతంబయిన మేఘవర్ణుం డను వాయసముచేతనే మనదుర్గదాహంబు చేయఁబడినది. అతఁడే మీపాల నీలవర్ణుం డనఁ జనువరియై యుండినవాఁడు. అపరికారము—" అనునంతలో నాతనిమాట కడ్డమువచ్చి తలయూచి నిశ్వసించి మరాళవల్లభుం డిట్లనియె: "ఔనౌను, ఉపకారంబువలనం గాని ప్రణయంబువలనం గాని కానివాని విశ్వసించినాతఁడు వృక్షాగ్రమున నిద్రించువానివలెనే యధఃపతితుం డగును. సందియము లేదు. తదనంతరోదంతంబు చెప్పుము" అనుడు బకం బిట్లనియె. "ఆప్రకారము దుర్గదాహంబుచేసి డాయవచ్చిన మేఘవర్ణునిఁ జిత్రవర్ణుండు సగౌరవంబుగా బహూకరించి, ప్రసాదమేదురంబుగా మంత్రివంకఁ జూచి యిట్లనియె:

"కృతకృత్యుఁ డయిన భృత్యునిఁ గృతం బూరకపోరాదు. ఆతండు మనోవాక్కుల సంతోషించు ప్రతిఫల మవశ్యము కలుగవలయును. కాఁబట్టి యీమేఘవర్ణునినే యాకర్పూరద్వీపరాజ్యంబున కభిషిక్తునిం జేయుదము." అని చెప్పినప్పుడు పొరిచొప్పు తలఁపునం బాటి పరధ్యానముతో విచారించుచున్న రాజుం జూచి మంత్రి చక్రవాకంబు "ప్రణిధి యేమో ముఖ్యాంశంబు మనవి యొనరింపఁ బోవుచున్నాఁడు. దేవర పరాకు లేక సనాకల్యముగా నాకర్ణింపవలయును." అనుడు ఱేఁడు "ధవళాంగా! మేము చిత్తగింపుచునే యున్నారము. ఏదీ? తరువాయి వృత్తాంతమును వినిపింపుము." అనవుడుం బ్రణిధి యిట్లు విన్నవించుచున్నాఁడు.

అంత నామాటలకుఁ బ్రధానమంత్రి యైన దూరదర్శి యిట్లనియె. "దేవా! ఇప్పు డేలినవారు సెలవిచ్చిన దంత యుచితం బని నేఁ దలంపను. ఈతనికి మేలొనరింపం దలంపఁగొంటి రేని, ప్రసాదాంతరము చేయుటయె యెంతయు నర్హకార్యము. చూడామణిస్థానమునం బాదుకల నిడఁ గూడనట్లు, మహాత్ము లుండఁదగిన పదంబునందు నీచుల నెప్పుడును నిలుపరాదు. నీచున్నయోగ్యునిం దెచ్చి యతిశయస్థానమునందు నిలిపిన భూమిపాలుండు, కాలం దొడుగఁదగిన పాదుకలం దల ధరించినవాని వలెఁ బరిహాసపాత్రుఁ డగును. లోకములో దేవర యెఱుంగనిది మఱి యెవ్వ రెఱుంగుదురు? పూజించినను సన్మానించినను గూడ నపకారంబు చేయుచుండుట యల్పులకు నైజగుణము. శిరంబున ధరించినను గాలం ద్రొక్కినను భుజగంబు బుసలుపడం గఱచును గదా? నీచులు శ్లాఘ్యపదంబుం బొందుదు రేని, యొకానొకప్పుడు మేలు చేసినవారికే ద్రోహంబు చేయఁ జింతింతురు. మున్నొకకాలసర్పము వణిజునిచే బ్రతికింపంబడియు, నాతనికే యపకారంబు చేయఁ జూచెను. దేవర కాకథ వాక్రుచ్చెద నవధరింపుఁడు.

ప్రాయు లైనవారిం దొరకినపుడు దొరింపక విడువరా దని పలుకుచు, నాలుకలార్చుచుం గవిసి యాతనిపైఁ బడి కఱువఁ బోయెను. అందుల కాతం డడలు గడలుకొన వడఁకుచుఁ బరిసర ధరాధర దరీద్వారంబులు మాఱుమోఁగ్రియ నఱచుచు సంచి నొక మూలం బాఱవైచి ద్వా రము వెనుకయుఁ దాను ముందునుగాఁ బఱవఁ జొచ్చెను. ఆ చేరువ పొదలో నిదురించుచున్న గోమాయు వాయలుకుడు విని యులికిపడి లేచి వచ్చి, ఫణికిని వణిక్ఛిరోమణికిని నడుమ నిలిచి యిట్లనియె: "ఓ యురగరాజమా! ఏల యూరక కోఁజుచు నీపాఱుఁబోతు నంటం బడి పగగొత్తుచున్నాఁడవు? ఇంచుక సేపు నిలిచి నీవార్త నాతోడఁ జెప్పుము. నాచేత నగు సాహాయ్యం బున్నం జేసెదను. అనినం గృష్ణాహి తన యావద్వృత్తాంతంబును బూస గుచ్చిన రీతిని వినిపించెను. అది విని యక్కజంపడిన ట్లభినయించుచు నక్క యిట్లనియె: "ఓమిత్రమా! ఇప్పుడు నీవు చెప్పిన చరిత్రము విస్రంభపాత్రముగా నేఁ జింతింపను. ఈసంచి యెక్కడ? నీదేహ మెక్కడ? దీనిలో నీవు పట్టుట యెక్కడ? నీవు చూడఁబోయినఁ బెద్దబా మున్నావు: సంచియో పట్టు మన్న జేనెడు లేదు. నీ వింద మరలఁ జొచ్చి చూపుదువేనియు నీమాట సత్య మని విశ్వసింపఁగలను. అనుడు నానాగుఁ డా మన్నన సంచిం బ్రవేశించి, తోకపెంటిమట్టలు చుట్టఁ జుట్టుకొని లోపల నిమిడియుండెను. వెంటనే యామృగాలము మోమున దైన్యంబు మిగులఁ బెదవులు తడుపుచు నిలుచున్న యావణిజునకుం జేసైగ చేసి యాసంచిమూతిని గట్టిగా దారముతో బిగింపు మని చెప్పెను. అతఁ డాప్రకారము చేయ, తనచేతి బడితెతో సంచిపైని నాలుగు మోఁదులు మోది [illegible]కమును స్వర్గలోకమునకుం బుచ్చి, జంబుకంబుం గొనిపోయి తనదారిం బోయెను.

కాఁబట్టి నీచులు తమ కుపకారంబు చూపినవారికే యపకా రంబుఁ దలంతురు. అంతియ కాక, ప్రముఖ సహాయము చేసిన యుప

కారంబును నిసుకయందు రచించిన ముద్రయుంబోలెఁ జాలకాలంబు నిలువదు. మార్జాలంబును ధర్మకర్తఁగా భావించి సేవింపఁబోయిన శశకపింజలములకుం బోలెఁ దమ కెప్పుడు కీడు మూడునో యని యెంచి, ప్రజలును నల్పునిం గొలిచియుండ నోడుదురు. ఆ కథ వాక్రుచ్చెద నాలింపుఁడు.

వింధ్యాటవిలో నొక వృక్షకోటరంబునఁ జిరకాలమునుండి కపింజలం బను పక్షి యొకటి కాపురం బుండును. ఒకనాటి సూర్యాస్తమయ సమయంబున మొయిలుమొత్తమ్ములు వియత్తల మెల్లఁ గాలుక్రమ్ముకొని కడవలం గ్రుమ్మరించినట్లు ఘోరజడివాన కురిసెను. ఆవర్షంబునం దడిసి తడిసి యాపులుంగు వేళకుఁ గూడుఁ జేరనేరకపోయెను. అప్పుడు దీర్ఘకర్ణం బను పిల్లి యొక్కండు భృశంబును వానను నాని యాశకుంతం బుండు తరుకోటరంబు చేరి, కమ్మనిగా నందు సుఖనిద్ర చేయుచుండెను. ఇంతలోఁ గపింజలము తన నివాసస్థలి వెదకుకొనుచుఁ జిమ్మచీఁకటిలో వచ్చి లోన నివసించు కుందేలుం గని యదలించి కోపంబు గదురఁ నిట్లనియె. "ఓరీ! మాధవా! నీ వెంట దేవియెడ వచ్చి యిప్పు కారణంబున నాగృహం బాక్రమించుకొని, నిశ్శంకముగా శయనించుచున్నాఁడవు. ఇఁక నైన నాలస్యంబు చేయక నాయిల్లు నాకు విడిచి యవలికిఁ బొమ్ము. చూడు పోకుంటివా నీప్రాణములు నీవి కావు." అనిన నగుపంబున శశకం బిట్లనియె. "చాలుఁజాలు. నీబెదరింపుమాట లింతటితో గట్టిపెట్టుము. దీర్ఘకర్ణుని ముందరనా బెదరింపులు పలుక వచ్చితివి? వాసగృహంబులును తటాకంబులును గుహవివరంబులును నెవ్వరు ముందుగా నాక్రమించుకొందురో వారివి గాని యెల్లకాలముఁ బ్రత్యేకముగా నొక్కరి సొత్తులు గావు. మాటాడక పోపో, పోనొల్లనే నెవ్వనికైనం దగవునకు రా. పోదము" అనిన "వ్యవహారమునకు ధర్మస్థుచో రానవచ్చునా? ఈరాత్రి పుచ్చి వేగినం బోదము. అందాఁకఁ

గొంచె మోపికపెట్టుము." అని యాకొఁదవరాత్రి నెట్లో వేగించి తూరుపు తెల్లవాఱుడు శశంబును లేచి, దానితోఁ దగవునకుం బోదము నడువు మని నాలుగడుగులు వెట్టి, యాపిట్ట మనవివాదంబు దీర్పఁగల వాఁ డెవ్వఁ డనిన దీర్ఘకర్ణుం డిట్లనియె. "నర్మదాతీరంబున దధికర్ణుం డను మార్జాలవల్లభుం డొకఁడు గలఁడు. అతఁడు బహుకాలవృద్ధుఁడు; బహువ్యవహారనిపుణుఁడు; శాంతమూర్తి, సధర్ముఁడు. అతఁడే మనచిక్కు వదలింపఁ దగినవాఁడు" అనినఁ గాఁబోలు నని యొప్పుకొని యాకపింజలము కుం దేటితోడఁ గూడఁ గాల్దెరువునం జని చని మిట్టమధ్యాహ్నమున నా ప్రాంతము వుండు తావుం జేరెను. ఆహా! కాలంబు చేరువయినఁ దల లుత్తరించుకొనిపోవువోటికే పాదంబు లెంత వారి నయిన నేరధారుల నడ్డుకొనిపోవును గదా! అట్లా శశకపింజలములు గమ్యస్థానంబుఁ జేరి, పురోభాగంబున వృద్ధమార్జాలునిం గాంచి, కపటధార్మికుఁడును గేవల జఠరపూరకుండును నని యెఱుంగక యిట్లనియె. "ఓమార్జాలనాయకా! మాలో మాకు నొకవివాదం బొక్కటి పుట్టె దానిని ధర్మస్వరూపుల రగు స్వామిసమ్ముఖమ్మునం దీర్చుకోవలె నని బహుదూరమునుండి యాశపడి వచ్చినవారము. మమ్ముఁ దడవు కూర్చుండఁబెట్టక నిష్పక్షపాతముగా వేగిరము మావ్యవహారంబు తీర్చి మమ్ము మానెలవులకుఁ బంపివేయుము." అనిన నామునిపిల్లి యిట్లనియె:—'అయ్యలారా! మీ రేమో దూరమునుండి చెప్పుచున్నారు. జరాభరంబునకుఁ జాంద్రాయణాదివ్రతంబులు తోడుపడఁ గృశించి యింద్రియపటుత్వము తగ్గియున్నవాఁడఁ గాన నాశ్రవణంబులు దూరమునుండి మీవాక్యంబులఁ దిన్నగా గ్రహింపనేరకున్నవి. మీరిరువురుం జేరి యొక చెవిచెంత జేరి మీమీ వివాదాంశంబులఁ దేటపడ నుచ్చైస్స్వరంబునం దెలుపునది. మా కనుష్ఠానసమయంబు సమీపించుచున్నది; మాధ్యాహ్నికంబు లాచరించి దానధర్మములు చేసికోవలెను. అయి

రెండును రెండుచెవులలోను దనతన వ్యవహారమ్మును జెప్పుకొనుచుండ, పిట్టతగవు పిల్లి తీర్చినసన్న ట్లా జరఠమార్జాలంబు కాప్యతో నారెంటిని జిక్కంబట్టి యొక్కట మెడలు కొరికి చిత్రవధం బొనరించెను. ప్రాణ ప్రయాణవేళ నా శశకపింజలములు: "అయ్యో! ఒక్కరాత్రి కెవ్వరు పరున్న నేమి యని యూరకుండక లేనిపోని వివాదంబు పెట్టుకొని తగవునకుం బోవుద మను దుర్బుద్ధి యొకటి పుట్టి సుఖముగా బ్రతుకలేక వేకువజామునం బడిపోవునట్టు లేచి యింతదూరము పరుగెత్తుకొనివచ్చి, యీ ఖలుని నాశ్రయించి వీని మిథ్యావాదములు విని వృథా భ్రమపడి దుర్మరణంబుం దెచ్చుకొంటిమి. 'పోరు నష్టము పొందు లాభము' నన్న లోకోక్తి యెన్నండు నేల వ్యర్థ మగునా? వినాశకాలము సమీపించినప్పు డెవ్వారి యాలోచనలు నేల పనికివచ్చును? తా నొకటి తలంచిన దైవ మొకటి తలంచును. 'లలాటలేఖా నపునః ప్రయాతి' యన వినమే?" అని చింతించుచుం బ్రాణములు విడిచెను. మార్జాలమును యథేష్టంబుగ రెండుమూడుదినము లాహారంబు వెదకుకొన నక్కఱ లేక వానిని భక్షింపుచుండెను.

అప్పు డా చిత్రవర్ణుండు దూరదర్శిం జూచి, "మంత్రివరా! నీవు చెప్పినట్లు మేఘవర్ణుని కుపకారాంతము నే చేయుదము. కాని మున్ముందు చేయవలసిన పని యొకదానిం జెప్పెద వినుము. మనచే సంగ్రామంబున జయింపంబడిన కర్పూరద్వీపమునకు మరల నీమేఘవర్ణునినే పంపుదము. ఈతండు చని యారాజ్యమునం గల యుత్తమపదార్థములనెల్ల నిరాయాసంబున నిచ్చటకుం గొనిరాంగలండు. అప్పు డాతం డెచ్చినవానిలోం గొన్ని యపూర్వవస్తువుల మన యాప్తులకుం బుత్తము, కొన్ని మేలి వస్తువులు ప్రకృతివర్గంబున కొసంగుదము; మిగిలినవానిని యథేచ్ఛముగా మన మనుభవింపంగలము. ఆపయిని నిష్కంటకముగా మన మే యెల్లకాలముం జలనంబు లేకుండ నాదీవి దొరతనంబుం జెలింపం

గలము.” అను రాజువచనంబులు విని నవ్వి పారదర్శి వినయ విధేయత్వంబులు కాన్పింప మెల్లగా నిట్లనియె. “దేవా! అనాగతకార్యంబుల దలంచి సంతోషింపరా దని నయవిదులు పలుకుదురు. మనోరథరాజ్యపాలనంబున నానందించువాఁడు కడపటఁ బేలపెండికుండం బగులఁగొట్టుకొన్న మేదినీవిబుధునివలెనె విషాదంబు నొందును. ఆకథ వినిపించెదను. వినుండి.

అయోధ్యానగరంబున దేవశర్మ యను బ్రాహ్మణుఁ డొకఁడు గలఁడు. ఆమహీసురుఁడు మహావిషువత్సంక్రాంతినాఁడు మఱియొక విప్రునియింట శ్రాద్ధమునందు నిమంత్రితుఁడై, యొకసక్తుపూర్ణశరావమును దానముగాఁ బ్రతిగ్రహించెను. అందున కాతఁడు డెందంబున నమందానందము నొంది, యాసక్తుఘటముం గొని యుబ్బున కదలెంచుచుఁ గడుపార శ్రాద్ధభోజనంబు చేసియుంటఁ జేసి నడవఁ జాలక యూయాస పడుచు బొజ్జ నిముఱుకొనుచు మెల్లన మార్గంబున నొక కుంభకారుని గృహంబు చేరి యరుగుమీఁద దొంతరలుగా నిడిన కడవలకడఁ దన నీరుకావిదోవతిం బఱచి, తలకుఁ జుట్టిన యంగవస్త్రము తీసి చుట్టకుదురుగాఁ జేసి దానిపయిని సక్తుభాండంబు నిడి, సక్తురక్షణార్థంబు దక్షిణహస్తంబున దండంబు నొకదానిని ధరించి, యెడమచేయి తలగడగా నిడుకొని యాపంచెమీఁద శయనించి, కన్నులరమోడ్చి మితిమీఱిన కోరికలు కోరుచు నిట్లు చింతించెను. “ఈసక్తువును మంచివెల వచ్చినప్పు డమ్మి యొకపాఁడిమేఁకను గొనియెదను. అది యేఁటేట రెండేసిపిల్లలఁ బెట్టుచుండును. అవియు వానికిఁ బుట్టినవియు సంవత్సరక్రమమునఁ బెఱిగి కొన్నిహాయనములలో బహుసహస్రములగును. అప్పుడు వానినన్నిటిని విక్రయించి నూఱుపాఁడిమొదవులఁ గొందును. ఆధేనుశతమును గతిపయాబ్దములలోఁ బెక్కుదూడల నీనును. అవి యన్నియుఁ గాలక్రమమున మందలు మందలుగా వర్ధిల్లి,

దొడ్లు నిండిపోవును. ఆవల వానిలోఁ గొన్నింటితో విరివిగా వ్యవసాయము సాగించి, పొలములలోఁ బండినపంటలలోఁ గొంత విక్రయించి లక్షసంఖ్యలధనము నార్జించెదను; మఱికొన్ని కోడెల నమ్మి సొమ్ము కూడఁబెట్టెదను. ఆవిత్తముతో నత్తఱి నేను కోటీశ్వరుఁడ నగుదును. ఆపిమ్మట మాయింట నేనూలుఁ జూచినను రొక్కము వెక్కసముగా మూలుగుచుండుట నెఱిఁగి యెల్లవారును నాకు 'మేము కన్య నిచ్చెదము మేము కన్య నిచ్చెద'మని యింటిచుట్టును దిరిగి పోవుచుందురు, అందులోఁ గులగుణరూపసమన్విత యగు నొకతన్వి బెండ్లియాడెదను. ఆ లలనవలన నాకు మారునిం బోలు కుమారుఁ డొకఁడు కలుగును. వానికి సోమశర్మ పేరే తప్పక పెట్టెదను. గృహకృత్యనిర్వహణాయత్తచిత్తంబున నాసుందరి నందను నెత్తుకొనక నాముందఱ విడిచి పోవఁ గోపంబు పట్టలేక నెనుకపాటునఁ బోయి యామగువ నీ లగుడంబుననే నాలుగడపు లడఁచెదను." అను సమయమునఁ గొంచెము నిద్ర వచ్చి కొప్పలు వాల్చి నిజముగా. భార్య వచ్చి ముందు నిలుచున్నట్టు కలవరించి, యాగ్రహంబునఁ దనకుడిచేత నున్న దండముతో నాపిండికుండను భిన్నభిన్నములుగా గొట్టెను. కట్టి విసురు నప్పటి శబ్దములలోఁ గొన్ని యూచేరువ నున్న భాండసంస్థలకుం దగిలి కొన్నికుండలు పగిలిపోయెను.. ఆచప్పుడు విని యదరిపడి లోపలినుండి కుమ్మరివాఁడు పరువెత్తుకొని వచ్చి యా వెడఁగుబాపనయ్యకు నాలుగు బాహుమూసంబు లప్పించి, వడివడి నాపుడమివేల్పును జావడి నెడల నడఁచెను. కాఁబట్టి యెందును రాఁబోవు కార్యంబులం దడవి కొని సంతోషించువాఁడు మున్నున్నదానిం గూడఁ జెడఁగొట్టుకొనుటయె కాక, సరివారిలో హాస్యాంబు వడయును.

అప్పుడు మయూరసార్వభౌముండు మంత్రిం జూచి యిట్లనియె. "పారదర్శి! నీ వివఱికును వచియించిన దంతయు నాచరణీయం బయి

వచ్చియున్నది. దానంజేసి యిఁక దేవరకీర్తి లోకంబున శాశ్వతంబుగ నెలకొనఁగలదు. అంతకన్న మనకుఁ గావలసిన దేమి? హిరణ్యగర్భుండు దేశకాలానుకూల్యంబు తెలిసి గెలిచిరి మరల సంగరంబునకు రాక తక్కఁడు. పరమర్మభేదనోపాయధౌరేయుం డగు సర్వజ్ఞుని బుద్ధిసంపదకుఁ దోడు సహాయసంపదం గూడఁ బడసి దడంబులతోడ దాడివెడలి మనయొ దొడరు మరాళరాజున కాజియిచ్చి నొచ్చి యోడి దిగ్గేశముల వ్యాపించిన యశస్సును గోలుపోక నిలుపుకొనుట యుక్తము. నేఁ జెప్పవలసినది చెప్పితిని. ఇఁక దేవరయిష్టము." అనినఁ బకపతి నవ్వి బలదర్పంబున నాతనిమాటలు పాటింపక శిఖండీంద్రుం డిట్లనియె.

"నీ వేమో లోకములో లేని యూహల నెల్ల నల్లి నేర్పుమెఱయ న్నిరాధారముగా నాకాశహర్మ్యమును నిర్మింపఁ జూచుచున్నాఁడవు, కాని యది యుక్తిమారుతంబు తాఁకునకుం గదలక నిలువనేరదు. సంగ్రామంబున సర్వంబును బోఁగొట్టుకొని ప్రాణమాత్రావశిష్టుండై యోడి పాఱిన హిరణ్యగర్భుం డెక్కడ? సంగ్రామవిజయగర్వోన్నతి న్మేరలు లేక మలయుచున్న చిత్రవర్ణుని నాతండు భండనంబునందాఁకి మానప్రాణంబులు గోలుపోక నిలిచి గెలుచు టెక్కడ? ఈమాట లెవ్వరైన విన్న నవ్వుదురు. బాహుబలంబున నార్జించుకొన్న నేల నాచికోలేక నిష్కారణముగాఁ జేవిడుచుట వీరధర్మంబు గాదు. రణవిజితుం డగు హిరణ్యగర్భుం డిప్పుడు నాచేతిలోనివాఁడు. ఆతని నాతనిరాజ్యంబును నాయిచ్చవచ్చినట్లు చేయఁగలవాఁడను. నీ విఁక వేయి చెప్పినను రాజ్యంబు విడువఁగలవాఁడను గాను. ఇంక నీవిషయమున నీవు నాతోడ నేమియుఁ జెప్పవలదు." అని వీరగర్వంబునఁ గొలువు విడిచి లోపలి మందిరంబునకుం జనియెను. అంత మంత్రి మొదలగువారును దమతమ నెలవులకు నరిగిరి. నేనును దేవరకు వా

నొక లేఖ లిఖించి, పదిలంబుగా ముద్ర వైచి, విచిత్రుం డను బకం
బును రహస్యంబుగఁ బిలిపించి యాలేఖ నతనిచేత నిచ్చి, సింహళ
ద్వీపంబునకుం బుచ్చెను.

అంత నచ్చటఁ జిత్రవర్ణుండు మఱియొకనాఁడు నిండుకొలు
వుండి నానావిషయంబులు ముచ్చటించుచు, ప్రసంగవశంబునఁ గర్పూ
రద్వీపముమాట వచ్చి మేఘవర్ణునితో ని ట్లనియె: "ఓయీ! మేఘ
వర్ణా! నీవు బహువారములు కర్పూరద్వీపమును నుండి వచ్చితివి గదా?
హిరణ్యగర్భుఁ డెట్టిగుణములు గలవాఁడో యాతనిమంత్రి చరిత్ర
మెట్టిదో నీవు చక్కఁగా గ్రహించియుందువు. కావున వానినెల్ల
మాకడ వినిపింపుము మాతో," అనినఁ గాకం బిట్లనియె: "హిరణ్య
గర్భమహారాజు మహాశయుఁడు. సత్యసంధుఁడు. జాగరూకుఁడు.
మంత్రి సర్వజ్ఞుండును సర్వవిషయంబుల సమర్థుండు. ప్రెగ్గడతనంబున
నాతనితోడ నీడగు ప్రయోజకుని నొండొకనిం గానము." అనినఁ
జిత్రవర్ణుండు తల యూఁచి మందహాసపూర్వకంబుగా ని ట్లనియె.
"అంతటి మహాశయుం డగుటచేతనా హిరణ్యగర్భుండు నీచేత నంత
సులభముగా వంచితుఁ డయ్యెను? ఏఁడీ! ఇఁకఁ గొంత చెప్పుమా?"
అనిన వాయసముఖ్యుం డిట్లనియె: "విశ్వాసయుక్తతంబున నేమఱి
యున్నవానిని వంచించుట యొక ఘనకార్యము కాదు. నమ్మకము
చేతఁ దొడపైఁ దల నిడుకొని సుఖముగా నిదురించుచున్నవానిని
గొంతుకోయుట యొక పౌరుష మగునా? నల్లని నెల్లనివన్నియు దెల్లని వెల్లఁ
గాలును ననుకొను నమాయకులు తమవలెనే లోకములో నెల్లవా
రును సత్యవాదులును సన్మార్గవర్తులును నిష్కపటులును ననుకొం
దురు. లోపల నుండు మాయలును మర్మములును నెఱుంగరాకుండ
నెయ్యపుమెయిం దుర్జనులు చెప్పు తేనెమాటలకు మోసపోయి పరిభ
వమున వారివలలం దగులుకొందురు. ఒకటిరెండుమాటు లనుభవ

ము నమ్మిఁ జిటఁ దరువాతి విషయములలో మిక్కిలి జాగ్రత్త గలిగి యుందురు. ఎవ్వరైనఁ గ్రొత్తగా వచ్చినవానిగుణంబు లిట్టి వని వానిమాటలనుబట్టి నిశ్చయించుకోవలెను గాని మనసులో నే మున్నదో లోపలఁ జొచ్చి చూడ లేము గదా? పూర్వ మొక యజ్ఞోపయుఁడు కొందఱు ధూర్తుల చేత మోసపుచ్చఁబడలేదా? దేవర కాకథ విని పించెదను వినుండు.

బ్రాహ్మణుఁడు పరమశాంభవుఁ డొకఁడు తన యధ్వరార్థంబు నల్లమేక నొకదానిం గొని మెడకుఁ ద్రగ్గ మగ్గలముగా బిగించి మించు వేడుకతోడ నింటి కీడ్చుకొని పోవుచుండెను. త్రోవలో నొక చెఱువు గట్టుమీఁదఁ గూర్చుండి చూచి దుర్నయంబునఁ గొందఱు దురాత్ము లాయజంబును గాఁజేయువలె నని తలంచి తమలోఁ దా మిట్లు చింతించిరి. "ఈధరామరుం డదె బలిసిన మేకపోతుం గొనిపోవుచున్నవాఁడు. ఒక్క నిమ్మ మిచ్చి కొంద మన్నను మన కిట్టి క్రొవ్వినది సాధారణముగా దొరకదు. ఈవైదికశిఖామణి నేలాగున నైన వంచించి యాఛాగంబు నిప్పు డపహరించితిమేని, వారముదినములవఱకుఁ బుష్కలముగా మన మనస్స్యాపేక్షంబుగ మాంసభక్షణంబు సేయవచ్చును." అనుసెడ నొక ధూర్తుఁడు నడుమ నడ్డము వచ్చి యిట్లనియె. "ఈబ్రాహ్మణుఁడు పిశాచమువలెఁ బట్టుకొని యేమఱక యీమేకం గొంతున కురి పోసి ధరాపరాగంబు రేఁగ లాగుకొనిపోవుచుండఁ, బట్టపగలు నట్టనడువీధిలో మన మెట్లు దీని నెత్తుకొనిపోయి ప్రజలకన్నులు గప్ప గలము? రాజభటులును భయంకరు లయి యమకింకరులవలె దండ హస్తులై యూర నెల్లెడఁ దిరుగులాడుచున్నారు. మనల నొకవేళ దొంగల మని పట్టుకొనిపోయి, చండశాసనుఁ డగు రాజునెదురం బెట్టినఁ గూరశిక్షలకుం గుఱి కావలసివచ్చును. దైవ మిచ్చిన మాత్ర ము సుఖముగఁ గుడిచి కూర్చుండ లేక తలక్రొవ్వి యకార్యకరణంబు

నకుం జొచ్చితిమేని, మన కందఱకు నేకకాలంబునఁ గాలంబు చేరు వగును. ఈవ్యర్థప్రయత్నముచే మన కవమానం బగుట దక్క నభిమత కార్యసిద్ధి యొదవ నేరదు. నాబుద్ధి విని యింక నీప్రయత్నంబు మా నుఁడు." అనినం బకపక నవ్వి, బాల్యమునుండియు మోసపుఁబనుల నాఱితేఱిన యొకవృద్ధవంచకుం డిట్లనియె:— నీకు లోకానుభవంబు చాల మిం జేసి చేలతనంబున బాల్యవాక్యంబులు పలుకు చున్నాఁడవు. నిజ ముగా నావంటి ప్రౌఢుఁడు దలఁచుకొన్న నీయల్పకార్యంబు సాధిం చుట యెంతపని? ఖాలాకైనను మోసపుచ్చి యభిమతంబు తుదముట్టించెదను. చూడు మేనిదె నీవు చూచుచుండ నాశక్తిచేత నీమేకపోతును గుక్కుచేసి తీసికొనివచ్చి మీ కందఱకు గాంతులు దీఱ దీనిమాంసంబున విందుచేసి మీచేత నిప్పుడె మెప్పించుకొందును. తొల్లింటికాలంబున నొకమర్కటంబు మకరంబును మోసపుచ్చి కాదే తనప్రాణంబులఁ గాపాడుకొనెను. మీ కక్కథ వక్కాణించెదఁ జక్కఁగా వినుండి.

పశ్చిమసముద్రతీరంబున నుండు నడవియందు బలవర్ధనుఁ డను ప్లవంగపుంగవుం డొకఁడు వసియించుచుండును. ఆతండు వార్ధక్యం బున హీనసత్త్వుం డగుట చూచి యాతని జ్ఞాతులు సర్వముం దోఁచు కొని యిల్లు వెడలనడఁచిరి. బలవర్ధనుండును నడవులపాలయి పోయి పోయి, తపతీనదంబుతీరంబున ఫలభరితంబై యున్న యొక్కమేడిచెట్టు నాశ్రయించి, తత్ఫలాహారంబున శరీరధారణంబు గావించుకొనుచుం డెను. ఇట్లు ఫలమాత్రమునఁ బ్రాణభరణము చేసికొనుచు నాయు దుంబరవృక్షముమీఁదఁ జిరకాలము నిర్విచారముగా నుండి యొక్క నాఁడు పండ్లం దినుచుండ వలకేలం బట్టుకొన్న పండు ప్రమాదవశంబు నం జాఱి నీరంబులం బడి బుడబుడ శబ్దం బొక్కటి పుట్టెను. వానర మున కానినదము శ్రవణానందమగా నున్నఁ దన మర్కటచేష్టలు

మీగృహంబున కెట్లు రాఁగలుగుదునో చెప్పుము." అనిన మకరంబు కరంబును మిన్నువంకఁ జూచి యాలోచించి యిట్లనియె; "నే నంత విచారింపక నిన్నుఁ బిలుచుకొనిపోఁ దలఁచినవాఁడను గాను. నాయిల్లు నీకు రారానిచోటు గాదు. మే ముండునది యీయేటిలంకలోని యొక సుందరమందిరము; దానిచుట్టుపట్టుల ఫలవృక్షము లనేకంబులు గలవు. ఆదీవి మనోజ్ఞకం బే మని చెప్పుదును? అది భూతలస్వర్గంబునాఁ జూడ్కికి వేడ్కఁ గొలుపుచుండును. నేఁడు మాపును మామందిరంబున సపర్యఁ గొనుచు నిచ్చవచ్చినప్పు డెల్లఁ దరువిహారంబు సలుపుచుండ వచ్చును. మార్గంబున నీ కొక్కయపాయంబు గలుగకుండ నిన్ను నావీపుమీఁద నెక్కించుకొని యుపాయముగాఁ గొనిపోయి మా యావాసంబుం జేర్చి నాచెలియు నత్యంతతాత్పర్యంబున నావహించిన శాకపాకంబులతోడి భక్ష్యంబుల నుపాయనంబు చేసెద. నీసోదరి మనరాక కెదురుచూచుచుండును. రమ్మా పోయివత్తము." అనిన మాటలు మాటాడక యాకీశలోకేశుండు వృక్షావతీర్ణుం డయి క్రకచుని వీపున నెక్కెను. ఎక్కుటయె తడవుగా మకరంబు సుకరంబుగా వానరంబును వెన్నున నిడుకొని చనుచుఁ దిన్ననఁ దనలోఁ దా నిట్లు పలుకఁ జొచ్చెను. "అయ్యయో! ఎంత దారుణకర్మంబు గావింపఁ జూచుచున్నాఁడను! ఒక్కకాఁకుదాని నిమిత్తము మిత్రముఁ ద్రోహించి ఘోరపాతకంబు కట్టుకొనవలసివచ్చెఁ గా? ఇఁక నే నేదుర్గతికిఁ బోదునో యెఱుంగను. నావంటి దుష్టాత్ము లెం దైన నుందురే? దైవమా! నే నేమి నిందలపాలు గావలయునో?" అని యూరెలుంగున ననుకొనుచు ఖిన్నహృదయుండై చనుచుండఁగఁ గపివరుం డించుక గ్రహించి "మిత్రుఁడా! ఇప్పుడు నీమోము చూడఁ జూడ నొండొక విధంబుగాఁ దోఁచుచున్నది. నీయందు మునుపున్న యుత్సాహంబు గానరాదు. చిత్తంబు విచారాయత్తం బయి తత్తరించుచున్నట్లు కనుపట్టుచున్నది.

దేహము లాధివ్యాధిజరాన్వితములు; గృహంబున నాసహోదరి సేమమున నున్నది గదా?" యనెను. క్రకచుండు పలుకులం దడబాటుపడుచు 'నీచెల్లెలు కొంచెము వ్యాధిబాధిత యయి యున్న' దనెను. 'అంతటి యల్పరోగమునకా నీమొగ మింత చిన్నవోయినది? చీటికిమాటికిఁ దాలిమి దిగనాడుట మగపాడి గాదు గదా' యని బలవర్ధనుండు పలికెను. 'ప్రబలవ్యాధిపీడిత యయియే యున్న' దని క్రకచుండు సందేహించుచుఁ బలికెను. అంత నసమ్మిశ్రితాశయుండయి వానరాధ్యక్షుండు; 'వైద్యులం బిలిపించి వేగిరము దివ్యౌషధ ప్రయోగము చేయించినావు కావా?" యని యడిగెను. 'ఏమిమాయయో యెఱుఁగను; వైద్యు లెంతమంది యెన్నిమందులను వేసినను గుణ మియ్యలేదు— నిన్నట్లు వీడ్కొనిపోయి చూచునప్పటికి నీచెలియలు యమయాతన పడుచున్నది; నాకుం జూడ నీరోగము కుదిరి జీవించుటయె కష్టముగాఁ దోఁచుచున్నది' అని క్రకచుండు బదులు చెప్పెను. విని వనచరుఁడు; 'ఇది యేమి? మిత్రుఁడా! ఇంత వెఱ్ఱిపని చేసితివి? ఇంట భార్య యిట్టియవస్థయం దుండఁగా మందు మాకును విచారింపక యొంటి నీడిచి మిత్రునియొద్దకు రాఁ జిత్త మెట్లొప్పెను? వినుమనకుఁ బిలువ నోర్వాడెను?' అని మందలించెను. 'ఘనవైద్యులు కొందఱు కోఁతిగుండెకాయతో మం దీయవలె నని చెప్పుచున్నారు అందునిమిత్తము వచ్చితి' నని యాక్రకచుండు శోకవ్యాకులితహృదయుం డగుకతంబున మఱిపోయి తనగుట్టు బయలఁబెట్టెను. ఆమాట విన్నతోడనె ప్రాణములు గలఁగఁబాఱ మేను చెమర్పఁ గొంతవడి యామర్కటంబు దిగ్భ్రాంతి నొందియుండి యంతలో డెందంబు కుందు దిందుపఱిచికొని 'అయ్యో! ఖద్యోతుఁడు సూర్యాతపమునకు సహింపలేక తాళవృక్షచ్ఛాయకుం బోవఁ దాఁటిపండు పడి తల పగిలినట్టు, దైవోపహతుం డగువాఁ డెందుఁ బోయినను నాపదలు వెంట

వచ్చును గదా! అడవిని విడిచి మృగసంచారము సహితము లేని సము
ద్రతీరముం జేరియు, మృత్యుముఖప్రవిష్టుండ నైతిం గదా' యని వగచు
చుం దెచ్చికోల్బింకంబున నిట్లనియె. "క్రకచా! యెంత పిచ్చిపని చేసితివి?
వానరహృదయంబుకొఱకు వచ్చినవాఁడవు వామాట నించుక మిత్రుని
చెవిని వేయవలదా? ముందె చెప్పిన మునిమిగడరియుంట నొమ్మియనేక
మేడిచెట్టునం దవిలించి యుంచిన నాగుండెకాయ నప్పుడె కూడఁ గొని
వత్తు గదా? నీమనోగతంబు దెల్పక మ్రుచ్చుగు బఱచి పని చెఱచితివి.
ఇట్టి నీవు కళత్రమునకు మిత్రుండవు గాక మిత్రుండవే? మన కింతవఱకు
నడిచిన దంతయు వృథా త్రిప్పట యయ్యెను. అయిన నేమి? శీఘ్రంబ
మఱలి మేడిచెంతకుం బదవెమ్ము. గుండెకాయం గొనివత్తము." అను
మాయమాటలు నమ్మి మకరి మాఱాడక యమ్మను గ్రమ్మఱ మేడికడకుం
గొనితెచ్చి విడిచెను. ఇకఁ బ్రాణములు దక్కిన వని యామర్కట
మొక్కవడి భూరుహంబు నెక్కి వెక్కిరించుచు, 'హృదయమును లేదు
గిదయమును లేదు పోపొమ్మని కేకచుని గర్జించెను. అది చూచి
మొసలి మోసముం దెలిసికొని యెవ్వనను మోసఁ బెట్టినో యెఱుఁ
గని నన్నును నిముసలికోఁతి యిట్టె మోసపుచ్చెఁగా యని వగచుచుండఁ
బ్లవంగ మిట్లనియె. "నీవు ప్రసాదపురస్సరముగా నెన్నియో యుప
చారవాక్యంబులు పలికి నిటలతటఘటితాంజలివై నీయింటికి రమ్మని
దేవురించుటం జేసి, పాపపు మోమోటమి నోరు నొక్క రానన లేక
మోసపోయితిని గాక నన్నుఁ బరిహరింప నీతర మగునే? ఓరిమూఢాత్మా!
మాట దాఁటక వచ్చి చేపట్టినవాఁడే తప్పించుకొనిపోయెను గదా యని
సంతాపంబు నొందక యీనాటి నీదారిం బొమ్ము. ఒక కూర్మముచేత
నక్క యంతటిది మోసపోయినది. ఇఁక నీ వనఁగా నెంతవాఁడవు? విన
వలతువే నాకథఁ జెప్పెద వినుము."

కర్ణాటకదేశమునందుఁ గావేరి యను నది యొక్కటి ప్రవహించుచుండును. సాగరసంగమునకు సమీపంబునఁ దత్తీరంబున నొక్క వటమహీరుహము గలదు. ఒకనాఁటి మధ్యాహ్నసమయంబున నొక కమఠంబు జలంబులు వెడలివచ్చి యచ్చెట్టునీడను సుఖముగా నిద్రించుచుండెను. అప్పుడు తత్ప్రాంతకాంతారంబున నుండు ఘోరవం బొక్కటి యాఁవేల నీరువట్టు మాన్పుకొనం జనుదెంచి శీతలపానీయంబు లాప్యాయనంబుగఁ బానంబు చేసి యా సమీపపాదపచ్ఛాయం బవళించి యున్న తాఁబేలుం గాంచి పరమసంతోషంబున మెల్లమెల్లగాఁ దారుచుం బఱతెంచి యేమఱుపాటున దానివీపుమీఁదఁ దనపాదంబు నూఁది త్రొక్కెను. అంత నాతాఁబేలు మేలుకని కీలెఱింగి కాలునుం గేలునుం డబాలున ముడుచుకొని తల పొట్టలో నిముడుచుకొని కదల మెదలకుండెను. క్షుధార్తం బగు మృగధూర్తంబును బదంబున దాని నదిమిపట్టి యిట్టటు పొరలించుచుఁ గోరులు మొనకలు వాఁడిఁ గొఱుకుచుఁ గూర్మంబుమర్మంబులు ఛేదింపఁ జాలక చాలసేపు విడిచిపోవను మనసురాక క్రిందను మీఁదను బడుచుండెను. అక్కరణి నది మిక్కిలి చిక్కులు పడుచుండ నక్కూర్మంబెక్కరణి నైన నీముక్కడినక్కను డక్కువెట్టి ప్రాణంబులు దక్కించుకొనెదఁ గా కని తలంచి యించుక యాలోచించి మాయ యచ్చుపడ నిట్లనియె. "ఓజంబుకోత్తమా! తత్త్వం బెఱుంగంజాలక యేల యీలాగున వృథాప్రయాసంబు పడియెదవు? నీ వీకైవడి వేయేఁడులు కొఱికినను నాయొడలు నీకుఁ గొఱుకుడుపడఁ గలదే? నీ వేవిధంబునను నను వధించి యాపోవ నామాంసంబు మెసవక యువలఁబో వని తలపోసి యీమడుగడపయి నాసను గోసి యనాయాసమరణంబు నొంద నిశ్చయించుకొన్నాఁడను. విషములోని బ్రతుకు; మా కెప్పుడును మృత్యువు శిరసుపై నాడుచుండును. కాఁబట్టి యూఁకొన్న మహానుభావునకు నీ కొక్క చక్కని యుపాయం బుపదే-

శించెదను వినుము. నన్ను గ్రన్ననం గొనిపోయి నీరంబులం జేర్చి కొంతతడ వందు నానవిచ్చిన, నా మేను వెన్నవలె మెత్తనయి నిమిషములో నీచిత్తమువచ్చిన ట్లగును. అప్పుడు కడుపార నామాంసంబుతో సుఖపారణ చేసి నీవలసినచోటికిం బోవచ్చును. అట్లు చేయుము.'' అనిన గోమాయువును మాయావాగురం జిక్కుకొని యక్కపటవచనంబులు వేదవచనంబు లని నమ్మి యదియ కార్య మ్మనుకొని తాబేలును బేలుపోక జలంబులం బడవైచియుం, గొంత మెలకువ గలిగి పట్టు విడువక గట్టిగాఁ దనముంగాళ్ళు వాసివిప్పన నొక్కిపె పండ్లయూటలు దాల్చుచు దానిమీఁదనె కన్నిడి ముహూర్తమాత్రంబు నిలిచి మరలఁ గొంతికి చూచి దానిబొసియు పండ్లకు సాధ్యముగా కున్నఁ గమఠంబున కిట్లనియె. "తడ వాయెను; నిన్ను జలంబుల నిడి యొడలు మెత్తపడినఁ గడుపడిం గుడిచి నడవవలె నని కాచుకొనియున్నాఁడను. ఏవేళకును నీమేను నాను జాడ గానరాకున్నది. ఏమి చెప్పెదవు?'' అనినఁ గచ్ఛపం బిట్లనియె. "మిత్రుఁడా! నీవు నావచనంబులయందు గురియుంచక వెన్నుమీఁద ముందుపాదములును దిట్టముగాఁ బెట్టియున్నవాఁడవు. ఏ రంట వలనుపడకుండ వెన్నున కెట్లు నడపోవ దారుణముగాఁ జరణంబులు నిలిపియుండ నామే నెట్లు నానఁగలదు? నీకోరిక యెట్లీడేరఁగలదు? ఇందు నాదోసంబు పిసంబును లేదు. నోటికనిచేత నీవే యింతతడవు నవనమ్మికపడి చెడితివి. అయిన నిప్పుడేమాయెను? ఇకనైన నామాట నమ్మి వెన్నుమీఁది పాదంబు లెత్తి క్షణమాత్రము చేరువం గూరుచుండి చూచుచుండుము. ఇప్పుడె పులఖండంబులబోలు నాపలఖండంబులతో విం దారగించి యనాయాసంబుగాఁ బోవచ్చును.'' అనిన నాసృగాలంబు కూర్మంబు వాక్యనిచయంబులు నిశ్చయంబులుగా వగచి తదీయోపదిష్టప్రకారంబున వెన్నుపై నిడియున్న యడుగుదోయిని

మెల్లఁగాఁ దీసెను. తీసినతోడనే ప్రాణంబుల దక్కించుకొని యక్కము ఠంబు శరవేగమునం బఱచి లోతునీళ్ళం బడియెను.

అని చెప్పి యామర్కటము మఱియు నిట్లనియె. "ఓరీ! మకరాధమా! మోసముల కెల్ల నిధి యగు వంచకమే యిటు వంచింపఁబడఁగా, నీవంటి పుట్టుగ్రుడ్డు మోసపోవుట యొక యక్కజమా? చాలుఁ జాలు. నీతోడ మైత్రి చేసినందునకు ఫలము తోడనే కలిగినది. ఇఁక నీమైత్రిని నీయొద్దనె యుంచుకొమ్ము. లోకవిఖ్యాతసత్వుండ నయ్యు దైవవంచనచేత రాజ్యంబుఁ గోలుపోయి త్రాణ చెడి రిపులతోఁ బడలేక కళత్రపరిముఖసుఖవిముఖుండనై లేచి వచ్చి నిలువ నీడయుఁ ద్రాగ నీరును గానక యేకాకినై యడవులు పట్టి తిరిగి తిరిగి కడ కీవృక్షంబుఁ జేరి స్వచ్ఛందాహారంబున నుదరపూరణంబు గావించుకొనుచుఁ గుల గోత్ర నామంబులు దాఁచుకొని యిన్నాటిదాఁక కాలము గడుపుచుండి, నీపెద్ద తనంబు చూచి బుద్ధి భ్రమసి మిత్రవంచకుఁడ వని తెలియంజాలక నీతోడి సఖిత్వం బంగీకరించితిని. నీవును పాపాత్ముర వైన నీభార్య దుర్బోధ చేతఁ జెడుబుద్ధి పుట్టి, కుటిలోపాయంబున నన్ను మట్టుపెట్టఁ దలఁచి, మాయింటికిం దావింపవు గాని రమ్మని నచ్చికబుచ్చిక లాడిన నే నా మర్మ మెఱుంగక నీయందిరమ్మనఁ దిరమ్ముగాఁ దలదాఁచుకొన నిశ్చయకుఁడ నయి నితాంతసంతోషంబున బయలుదేఱి మధ్యమార్గంబున నాకారవికారాదులచే భవదీయం బగు మనోవ్యవసాయం బూహించి పూర్వపుణ్యావశేషమున నీయుపాయంబు తోఁచఁబట్టి బ్రతికి, పులి నాకి విడిచినవానిఁగా భావించుకొనుచున్నాఁడను. ఆఁడువారు మంచి యెఱుఁగరు; చెడ్డ యెఱుఁగరు; పట్టి కుచ్చితములు పన్ని తమ పట్టినపట్టు సాధించుకొనఁ జూతురు. నీవు నాతోడిచెలిమిం జేసి యిల్లు పెట్టుకున్న, నన్నీలాగున నైనఁ జంపింపఁ దలఁచి యిది యంతయు నీభార్య పన్నిన

పన్నుగడ యయి యుండును. దేహములు బుద్బుదప్రతిమంబులు; పరువము ఫేనసదృశంబు; సంపదలు తటిచ్చంచలంబులు; అలంకారంబులు భిత్తిచిత్రంబులు; దారపుత్రాదు లాశ్మశానగమనులు గాని యాపయిని వచ్చువారు కారు; ధర్మ మొక్కటియే తోడ వచ్చి తన్నుఁ గాచునది. అట్లయ్యును నీవు తగవును ధర్మంబును దలపోయక సద్యఃపాతి యగు తనువును నమ్మికొని కీర్తిశరీరము వ్రీడిచి నిత్యం బగు సత్ఖ్యాతి గడియించుకొంటివి పాపాధికుఁ డయిన మిత్రద్రోహినే యట్లు చేసిన పరమ సాహసికునకు నీకు నితరులు తృణకణంబులు. మీఁద నీ వేమిగతిఁ బోవు వాఁడవో! నీయట్టి మిత్రద్రోహిం జూచుచున్న నఘం బొందవును. ఇఁక నీవు నాయెదుట నిలిచి నన్నుఁ గళంకింపక, వేవేగ నీ యింటికిఁ బోవఁ బట్టి పొమ్ము." అని ముక్కును మొగమును జూడక మాటలనాడి, నిస్త్రపుం జేసి పామెయొలిచి నక్కడనుండి సాగనంపెను. క్రకచుండును సిగ్గుపడుచు నక్కలు చూచుచు గోడిడిచేతుల నగ్గిగిడి నిజనివాసంబునకుం జనియెను.

కాఁబట్టి మోసముచే నెట్టిపని నైన సాధింపవచ్చును. నాయందనుగ్రహించి మీరందఱు నా కొక్క సాహాయ్యమును మాత్రము చేయుఁడు. మీరందఱును ముందుగాఁ బోయి బ్రాహ్మణుఁడు చను మార్గమునందు నొకరికొకరు దూరముగా నిలిచి, అతఁడు మీ సమీపమున నుండి పోవునప్పుడు 'ఓ బ్రాహ్మణా! కుక్కను నేల కొనిపోవుచున్నావు' అని ప్రశ్న చేయుఁడు. ఇంతమాత్రము మీరు తోడుపడితిరా, మిగిలిన కార్యము నేను జక్కఁజేసెదను." అని మాయావంచకుఁడు పలికెను. మంచి దని మాటకు సమ్మతించి, తక్కినవా రందఱును బ్రాహ్మణుని కగపడకుండ జని మార్గము పచ్చుదారిని సందంతుఁ గూరుచుండి, మాతనిరాకం బ్రతీక్షించుచుండిరి. ఇంతలో బ్రాహ్మణుఁడును మేఁక మోపు నెత్తుకొని, మొకటిపంచకుఁ డున్న తావునుండి పోవుచుండెను.

అప్పుడు వాఁడు "అయ్యో! మీరు చూడఁబోయిన బ్రాహ్మణోత్తములుగా నున్నారు. ఈకటికుక్క నేల ముట్టుకొని తీసికొనిపోవుచున్నారు?" అని యడిగెను. అందున కాబ్రాహ్మణుఁడు నేత్రాంతంబులఁ గెంపు గదుర. "ఛీఛీ! త్రాగుఁబోతా! మదాగతభాషలు ప్రేలకుము. నే నశ్వరార్థము కొనిపోవుచున్న యీపవిత్రమైన ఛాగమును అపవిత్రమైన శునకమునుగాఁ బలుక నీకు నో రెట్లు వచ్చినది? పో పో" మ్మని యామాటలను లక్ష్యము చేయక తనత్రోవం బోవుచుండెను. మఱి నాలుగడుగులు సాగినతరువాత రెండవ ధూర్తుఁ డెదురు వచ్చి. మస్తకన్యస్తహస్తుఁ డయి నమస్కరించి, బ్రాహ్మణునివంకఁ జూచి, 'స్వామీ! మీరు సర్వముం దెలిసినవారు గదా? ఈనల్లకుక్క నెగ్గు లేక ముట్టుకొనుచున్నారే' యని పలికి పోయెను. అందున కావిప్రుఁడు డెందములో నించుక సందేహించి, వానిమాటకు మాఱు చెప్పక మేఁకం గొనిపోవుచుండెను. ఇంతలో మూఁడవవాఁ డెదురుపడి, "ఇది యేమి? బాఁపఁడా! ఇంత యక్రమమునకు లోఁబడినావు. నీ వెత్తినది బ్రాహ్మణజన్మము గదా? అస్పృశ్యమును గుణశీలముల చేతఁ గలిపె లోకు లెల్ల నవ్వఁ బట్టపగలు రాజవీథిం బడి యీయపవిత్రమైన వేపి నెచట కీడ్చుకొనిపోయెదవు? ఈరాజ్య మేమిపాపము చేసెనో కాని కులాచారధర్మములు నిర్మూలములై పోవుచున్నవి." అని పలికెను. అంత నాయనంతాసుకుఁడు మది శంకాక్రాంతంబు నొంది చింకాసక్తుం డయి, "ఒకరు కాదిద్దఱు గాదు, కన్నవా రెల్లరు నీనిని వేపి యనుచున్నారు. నా కొకవేళ మతిభ్రమ జనియించెనో లేదో" యని చింతించుచు, ఉల్ల ముయ్యెలలాగున నూఁగ నిలుకడయం జాలక యనుమానించుచు నిలుచుండెను.

మొదటినుండియు బ్రాహ్మణు నెఱుఁగాయక వెంబడించి వచ్చుచున్న యాధూర్తపంచకుఁడు నాయత్నము ఫలోన్ముఖమునకు వచ్చెఁ గదా యని సంతోషించి, బ్రాహ్మణునకు వినఁబడునట్లుగాఁ జేరువ నున్న

దుని నిజభోగమున స్వహించి, కొండొకవడి చిత్రపరిచారంబున నిందు
నందుం ద్రిప్పి లేని బడలిక తెచ్చుకొని రోఁజుచుఁ దల వ్రేలవైచి
యూరకుండెను. జలపాదుం డంతయుం జూచి, నీ వేల యిట్లు నడవఁ
జాలకున్నా వని యడిగెను. మందవిషుండు: స్వామీ! నిన్నటినుండి
కబళమాత్రం బయిన నాహారంబు లభింపమింజేసి, శుష్కోపవాసం
బున న్మ్రగ్గుచు జవసత్వంబు లుడిగి జీవచ్ఛవంబనై యున్నవాఁడను.
కటికియాఁకట నకనకంబడు నా కిప్పు డాహారంబు దయచేసెదం గాక, నా
వాహనకృత్యం బెట్లు నిర్వహింపఁ గలుగుదును? కడుపు నిండినమీఁదట
మఱి నాచిత్రపదక్రమంబు దేవర చిత్తగింపవలయు." అనిన, నావా
క్యంబులు నిజమ్ము లని నమ్మి, యంతరంగంబు కరఁగినవాఁ డయి జల
పాదుం డిట్లనియె. "ఓభుజంగపుంగవా! నే నొక్కమాట చెప్పె
దను వినుము. మత్స్యమధ్య నీవు నన్నడుగవలసిన పని లేదు. కడుపు
చిచ్చు దరికొనునప్పు డెల్ల వలసినన్ని మండూకంబుల భక్షింప నొక్క
సారిగా నీ కిదె యాజ్ఞ యొసఁగినాఁడను. ప్రతిదినంబును నీ విచ్చవచ్చి
నన్నిటిఁ గొనవచ్చును. ఇప్పుడు పోయి యథేప్సితంబుగ నాహారంబు
గైకొని వచ్చి, మరల నావాహనకార్యంబునం బ్రవర్తిల్లుము." అనిన
మహాప్రసాదం బని జలమధ్యంబునం బ్రవేశించి కఱవుదీఱ, జిఱుకప్పలఁ
గొన్నిటిఁ గుటుకు రన మ్రింగి జఠరానలం బాఱ్చుకొని మండూకరాజు
నెదుర నిలిచెను. ఈప్రకారము యథేచ్ఛను ప్రతిదినమును వలసినన్ని
టిని దిగమ్రింగుచు, తొలుత సన్నగాండ్రను పిదప బలవంతులను నద
నంతరము మంత్రులను దినక్రమమున జలపాదావశేషంబుగా హ్రదంబు
నిర్మండూకంబు గావించి, కట్టకడపట నాకప్పలఱేనిని సహితము
కూయిడం బట్టుకొని మేనిమాంసం బాప్యాయనంబుగ మెక్కి, యి
ప్పటికి నావ్రతసమాప్తం బయ్యెఁ గా యని సంతోషించుచు, ఆకొలను
వెడలి యొండొకచోటికిం జనియెను.

డమ్యెను. అట్టివానిం బూజించి తెచ్చి, సకల రాజ్యాధికారంబునం బ్రతిష్ఠింపవలసినంత యక్కఱ మన కిప్పు డేమి కలిగినది ? అంత కలిగినప్పుడు పెలినట్లు చూచుకొందము. 'ఈఁగ గాచి, పాలమును నక్కలకుఁ బెట్టినట్లు' బాహుబలాధిక్యంబు పేరిమిని గష్టపడి రణంబునం గెలుచుకొన్న రాజ్యంబును ఫలకాలంబున నొరులపాలు సేయ నేల? ఈవిషయమున నక్రమముగాఁ బూనుకొని మహాబలుండు మనమీఁద ధ్వజమెత్తినను నెత్తనిమ్ము. నా ప్రతాపానలంబు వేఁడిమి నాతఁ డింకొకసారి బాగుగఁ జవిచూచుం గాక!" అనుచుండ నొక శుకంబు గోఁజుచు, గొలువుకూటంబు దిక్కునకుం బఱతెంచుచు గోపురమునుండి "దేవా! సింహళస్వామి రాజ సేనానీకంబులతోడ న్వెడలివచ్చి మనపట్టణమాక్రమింప దారాంబుధుల న్విడియుచున్నాఁడు." అని కేకవేసెను. రాజు వాక్యము విని యులికిపడి 'యేమి యేమిటి' యని యాతురతతో నడిగెను. కొలువువారును సంభ్రమమునొందిరి. అంతఁ జిలుకయు సమీపమునకు వచ్చి రాజునకు మొగము వేసి నమస్కరించి, "దేవా! సింహళస్వామి [illegible] మహాబలుఁ డాకస్మికముగాఁ గోటకారణ మేమియు లేకయే [illegible] వచ్చి, తనసేనల నగరంబు పరిగడ న్విడియించి యున్నాఁడు. ఆతండు మన రాజధాని స్వాధీనపఱచుకొను [illegible] [illegible] [illegible] చేయుచున్నాఁడు. వారిం జూచి [illegible] పౌరకాంతలు [illegible] బిట్టు భ్రమించుచున్నారు. [illegible] గోయుచు, [illegible] మిన్నును మన్నను [illegible] లేచి [illegible] గాంచితిని. [illegible] దానికారణంబు యోచించుచుండ నింతలోఁ [illegible] వేటు [illegible] [illegible] [illegible] నాలోకించితిని;

యోగు లని వేషములు వేసికొనువారి నెల్లఁ గాళ్ళు కడుపులు బట్టుకొని యాశ్రయించి వారిచే వేళ్ళు వెల్లంకులు గట్టించుకొనును, రాయి గన్న రాతికి గుడి గన్న గుడికి మ్రొక్కుచు, ఎవ్వ రేతీర్థముపేరు చెప్పిన నప్పటికిఁ బోయి మునిఁగి వచ్చుచు, లోకములో లేని నోములు వ్రతములు పట్టుచుండును. ఇట్లు కొంతకాలము గడచినపిమ్మట, నాయింతి యీశ్వరానుగ్రహమువలన గర్భవతియై యొకపుత్రకుం గనియెను. లేక లేక కలిగిన సంతాన మగుటం జేసి, తల్లిదండ్రు లాచిన్నవానిని తొమ్మిమీఁదికాలు నేలఁ బెట్టనీక ప్రాణములకంటె నెక్కువగా గారాబమునఁ బెంచుకొనుచుండిరి. ఒక్కనాఁడు దాదిస్తనము బా లిచ్చి నిదురపుచ్చి, యుయ్యలలోఁ బరుండఁబెట్టి, మగనిని గావలి యుంచి యాజ్ఞ సేని పొరుగువీధి నున్న తన పుట్టినింటికిఁ జూడఁ బోయెను. నాఁడు పర్వదిన మగుటం జేసి రాజుదగ్గఱనుండి పార్వణశ్రాద్ధదాన మిచ్చుటకొఱకయి, యాబ్రాహ్మణున కాహ్వానము వచ్చెను. సహజదరిద్రుఁ డయిన యాశుద్ధశ్రోత్రియుఁ డప్పు డిట్లు చింతించెను. "రాకరాక నేఁటికాలమునకు భూపతికి నాయం దనుగ్రహము వచ్చి, సాహిత్యపరు లనేకు లుండ వారిం గాదని నాకే దాన మియ్యఁ దలఁచి వర్తమాన మంపెను. నన్ను భాగ్యవంతునిఁ జేయవలె నను తలంపుతో నేలిక పిలువ నంపెనే, నావంటి యభాగ్యదేవత సమయమున కీయసందర్భము దెచ్చిపెట్టినది. ఇంటఁ బుట్టినింటనుండి నాభార్య వచ్చు టెప్పుడు? నేను బోయి దానము పట్టు టెప్పుడు? రాకున్న నేమి పోవును నన్ను, నిందాఁకఁ గంటికి ఱెప్పవలె నుండి కాపాడుకొనుచున్న పిల్లవానికడం గాపుండువారు లేరు; పోక మానెద నన్న, భూపాలుఁ డాదానము నన్యుల కిచ్చివేయును. నా కొకయుపాయము కనఁబడుచున్నది. బహుదినములనుండి కన్నబిడ్డవలెఁ బెంచుచున్న నకుల మున్నది గదా! ఈ పెంపుడుముంగిని నా ముద్దుపట్టికి రక్షక ముంచి, కదలిపోయి దానమును స్వీకరించి యింట

నూఱ్ఱెట్టు పరుగెత్తుకొని వచ్చెదను." అని నిశ్చయించి, ముంగిసను ససం కేతముగాఁ జెప్పి యాయర్భకునకుఁ గావలి పెట్టి, రాజమందిరమునకుం బోయెను. దానమునిమిత్త మేగిన రెండుగడియలును బ్రాహ్మణునికి శరీర మొక్కటియె రాజమందిరమున నుండెను, గాని చిత్తమంతయు నింటిమీఁదను గొమారునిమీఁదనె యుండెను. ఇంతలో నొకకృష్ణ సర్పము మిద్దెమీఁదినుండి యుయ్యాలచేరువఁగుండ బాలుఁడు నిద్ర పోవుచున్న పాన్పుమీఁదికిఁ బ్రాఁక వచ్చుచుండెను. దానిని ముంగిస చూచి యొక్కయెగు రెగిరి మెడ పట్టుకొని కొఱికి ముక్కముక్కలు చేసి క్రిందఁ బడవైచెను. అంత నా బ్రాహ్మణుఁడును రాచనగరం గాను వీనములు గ్రహించి, కొమరునిమీఁది ప్రేమ తనఁ ద్వరపెట్ట నేల మీఁద మడమలు మోపక డోలాయమానమానసుం డయి మహావేగ ముతో వచ్చుచుండెను. బ్రభువునుం దనస్వామి యడుగులచప్పుడు విని పామునెత్తు రంటికొన్న నోటితో మార్గమునఁ బొడుగున రక్తబిందువులు జాఱ పీనుగువక్త్రముఁ బిగ్గ కెను రేఁగి, సంతోషముతో నాబాపని కాళ్ళ ప్రేళ్ళం బడి పెనఁగఁ జొచ్చెను. రక్తవిలిప్తముఖం బగు నకులంబును జూచి గుండెలు తటతటఁ గొట్టుకొన, భీతిచకితచేతస్కుం డయి యా పాఱుఁడు తనకొమారుని నీనకులంబు చంపి వచ్చె నని యెంచు కొని, పెంచిన విశ్వాస మున్న లేక నాముద్దుపట్టి నెత్తురుఁగందు నెట్లు గఱచితి వని దురహంకారంబునఁ జేసన నున్న దుడ్డుకఱ్ఱను హస్తమున నంకించి నకులమును మోఁదెను. ఆమోఁదు శిరంబునఁ దగుల గ్రుడ్లు వెడలఁబెట్టి, నేలం బడి విలవిలఁ దన్నుకొనుచు నొక్కనిద్దయుఁ బలిచి నకులము ప్రాణము విడిచెను. అట్లాముంగిసనుజ్జుగొని యాభూసు రుఁడు నందనునికియు ప్రలాపించుచు లోనికిం జని తలిమంబునఁ జెక్కు చెమర్పకుండ నిదురించుచున్న బాలకుని గని, ప్రమోదమానమానసుం డయి, పదఁపడి డోలాసమీపంబున ఖండఖండము లయి పడి

దలపడుదుమేని మనవారు శరీరంబుల కాసపడక యెాపినంతనట్టు పోరాడినను దుదను బరాభవంబు నిశ్చయము. ఈమహాబలుం డిప్పుడు మనమీఁద దాడి వెడలుట, హిరణ్యగర్భుని మంత్రి యైన సర్వజ్ఞుని ప్రేరణముచేతం గాని స్వబుద్ధిచేతం గాదు; తన తొంటివిరోధంబు సాధించుకొనవలయు ననుద్దేశంబును దానికిం గొంత తోడుపడి యుండవచ్చును. అయినను నవమిత్రమనోరథం బడేఁబువేవి, ఈతండు సంతుష్టుం డగు తెఱఁగునకి మరలఁగలవాఁ డగుటకు సందియంబు లేదు. మన మిప్పుడు హిరణ్యగర్భుని సమాధానపఱచుకొను యత్నంబు చేయుటయె ప్రధానానుష్ఠేయ మైన కార్యము. కావుట్టి మున్ముందర యీహంసస్వామిపాలికి మనమాత యరుగవలయు: అట్లరుగు మాత కార్యసంఘటనం గానప్పుకొని మల మరలం జేయుటకు లోపలనే యీమహాబలుని విశేమువలన నొకటి పుట్టకుండ, ఈక్షణంబ సారస రాజునొద్ద కొకరాయబారి నంపుదము. ఇట్లు చేసిన సకలము ననుకూలంబుగా నడుచును.'' అనిన రాజును సౌ నని యొకొనియెను. అప్పుడె రాజానుమతంబున మంత్రి యసుణముఖుని రప్పించి, మహాబలునితోడం బలుకవలయు పలుకుల నెల్లం దేటపడఁ గఱపి, కార్యంబు పొత్తుపఱుచు కొని రమ్మని పంచిన, నాతండును వినయవేషంబునం జని నగరంబు పెంగడ నొక్కవనంబున నున్న స్కంధావారంబుం దఱిసి, సేనారక్షులకుం దన వచ్చిన కార్యంబు చెప్పి, యెల్లసైనికులు మూఁకలు గట్టి తన్నుఁ జూచుచుండఁ దన్మధ్యంబున నొకచోఁ జంపసలతసమీపంబున లతాగృహంబున వసియించియున్న మహాబలునిఁ ద్వారపాలకుల నెంబడిం బోయి సందర్శించి నమస్కరించి, యాతని యాజ్ఞానుసారముగా సమీపంబునఁ గూరుచుండి చేతులు జోడించి యిట్లనియె.

"దేవా! జంబూద్వీపాధినాథు లగు చిత్రవర్ణమహారాజులవారు తాముగ దేవరవారితోడ నాడు మన్న మాటల విన్నవించెద; అవధాన

ముతోఁ జిత్తగింపుఁడు. 'ఇరుగుపొరుగుల దేశముల కేలికల మయిన మనము మనలో నిట్లు దుర్మత్సరంబు వాటించి మానుషధర్మమును మఱచి లోకులు మనలం దలయెత్తి చూడ జగడము లాడుచుండుట యుచితము గాదు. మన మైకమత్యంబు ప్రేమని సోదరభావంబు గూరి యుందుమేని, ముల్లోకము లొక్కట నెత్తివచ్చినను గెలన; మనలఁ దేఱి చూడఁగలవే? పూర్వ మేవేళావిశేషముననో మన మనసులలోఁ గ్రోధాగ్ని పొడచూపె, మెల్ల మెల్లఁగా రాఁజి ప్రజ్వరిల్లి యుద్ధరూపమునం బయల్వెడలి యుభయపక్షములవారిం గొందఱ దహించి యప్పటి కాఱినది; ఆఱిపోయినదాని స్మరల మండఁజేయుచు మన మనస్సీమలఁ గోపంబును గాపురం బుండనిచ్చుట యుభయులకును క్షేమకరము గాదు. ఇఁకముందు మన మన్యోన్యస్నేహము నవలంబించి మీమాట మేమును మామాట మీరును జెల్లించుచుఁ గూడి మనుట మాయభిమతము. కర్పూరద్వీపాధీశ్వరుం డగు హిరణ్యగర్భుఁడు మన కిదివరకుఁ బ్రాణమిత్త్రుఁడుగా నుండఁ దగినవాఁడు. ఆతనిరాజ్యం బాతని కిచ్చితి మని తెలిపి, మాతోడ సఖ్యంబు నెఱప నాతని నడుగ నేఁడె దూతను బంపుచున్నారము.”

అని చెప్పి యూరకున్న, మహాబలుండును గొంతవడి చింతించి, తన బలంబులు మార్గాయాసంబునం బడలియుండుటం జేసియుఁ దన వచ్చినకార్యం బనుకూలముగా ముగియు చిహ్నములు కానఁబడుచుండుటం జేసియు సంధి చేసికొనుటయే యప్పటి కుచిత మని నిశ్చయించి, పూర్వవైరంబు మాని సంధి కియ్యకొనియె. అప్పుడు మహాబల చిత్రవర్ణులకుఁ గపాలసంధి యయ్యెను.

తరువాతఁ జిత్రవర్ణుండు తనమంత్రితో నాలోచించి, యుచిత గతిని హిరణ్యగర్భునిపేర నొకలేఖ వ్రాసి, తల్లేఖం గొనిపోయి హంస స్వామితో యుక్తక్రమంబున సంభాషించి కార్యంబు పొందుపఱుచు

కొని రా వరుణముఖుండె తగినవాఁ డని యెంచి, ఆతనినె పయనంబు చేసి క్రమ్మఱఁ గర్పూరద్వీపంబునకుఁ బంపి యాతనిపునరాగమనం బున కెదురుచూచుచు దినము లెన్నుచుండెను. ఆతండును గతిపయ ప్రయాణంబులఁ గప్పురపుదీవిం జేరి రాజధానిం బ్రవేశించి, ముందుగా మంత్రిసందర్శనంబు చేసి నిజాగమనకారణంబు దెలిపి, యాతండు తన్ను వెంటఁబెట్టుకొని పోవ హిరణ్యగర్భుని రహస్యావాసంబుం జొచ్చి యచ్చట నాప్తవర్గముతో నిష్టకథాప్రసంగంబులఁ గాలక్షేపంబు చేయు చున్న హంసాధ్యక్షుని వీక్షించి, నమస్కారపూర్వకంబుగాఁ ద న్నెఱిఁ గించుకొని, మితహితోక్తుల ని ట్లనియె. "జంబూద్వీపాధినాథుండు చిత్రవర్ణుండు దేవరసుగుణసంపదను బలువురు ప్రశంసింపఁ బూర్ణమ నంబుతో నాకర్ణించి, దేవరతోడి మైత్రి నపేక్షించి న న్నిటకుం బుత్తెం చెను. నేఁడు మొదలుకొని యథాపూర్వకముగా దేవరవారు కర్పూర ద్వీప రాజ్యాధికారంబు మరల వహియించి, లోకోత్తరముగాఁ బ్రజా పాలనంబు గావించుచు మయూరస్వామితోడి సౌహార్దసౌఖ్యం బను భవింప నర్హులు." అని లేఖం జేతి కిచ్చెను. దానిం బుచ్చుకొని చదువు కొని, హిరణ్యగర్భుండు మంత్రితో నాలోచించి తగిన ప్రత్యుత్తరంబు వ్రాసి ధవళాంగునిచేత నిచ్చి, 'నీ వీ యరుణముఖునితోడం జంబూ ద్వీపంబున కరిగి చిత్రవర్ణుని సందర్శించి యర్హసంభాషణంబుల నాతని నలరించి యాజా బిచ్చి రమ్ము' ని యానతి యొసఁగి, యరుణముఖుని నర్హ సత్కారంబుల గారవించి చెప్పవలయు పలుకు లెల్లం జెప్పి, వీడుకొలి పెను.

అంత ధవళాంగుండును నరుణముఖుండును బయలువెడలి, సరస సంభాషణంబుల మార్గాయాసంబు వీసంబును గానరాకుండ నడచి, కతిపయదివసంబులకు జంబూద్వీపంబు చేర చిత్రవర్ణుండు నిండుకొలు వుండియుండ నాతనిపాదసందర్శనంబు చేసికొని, సందేశంబు సమస్తంబు

నివేదించి, కృతకృత్యు లయిరి. మహాబలుండును మిత్రకార్యంబు సాధించుకొని చిత్రవర్ణుని మన్ననఁ బడసి పరమానందభరితుఁ డయి సైన్యసమేతంబుగా నిజదేశంబునకుం జనియెను. నాఁడు మొదలుకొని మహాబల చిత్రవర్ణ హిరణ్యగర్భు లన్యోన్యమైత్రిం బొదలుచు, పరస్పర క్షేమలాభంబులఁ బత్రికాముఖంబులం దెలిపి తెలిసికొనుచు, చిరకాలము సుఖముగా రాజ్యపాలనంబు గావించిరి.

అని విష్ణుశర్మ సంధితంత్రమును ససాకల్యముగా వచియించి, మీరును సర్వసర్వంసహాపతులతోను సంధి గావించుకొని, యైకమత్యంబు పెంపున సకలసౌఖ్యంబుల ననుభవింపుఁ డనిన, రాజపుత్రు లెంతయు సంతసించి 'దేవరమూలమున నజ్ఞానాంధకారంబునుండి వెలువడి జ్ఞానభాను న్సందర్శింపఁ గంటి' మని విష్ణుశర్మను నుతియించిరి. అంత సనయు లయిన నృపతనయులఁ దనవెంటఁ దోడ్కొనిపోయి, సుదర్శనున కర్పించి, విష్ణుశర్మ యాతనిచే సకలసమ్మానంబులం బొంది, యొకయగ్రహారము బహుమానంబు వడసెను.

సంధితంత్రము, సంపూర్ణము.

శ్రీరామముద్రాక్షరశాల — రాజమహేంద్రవరము.

# తర్కసంగ్రహము

గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగము పంతులు

ప్రకాశకులు:

హితకారిణీ సమాజము
రాజమహేంద్రవరము

1951

 [వెల రు 0-4-0

# తర్కసంగ్రహము

క. శ్రీ ఘనానీ
కా సర్వసజ్ఞ ♦ నార్తిహరుండున్,
శ్రీ ం నగు దేవునిఁ
ద్ర ప్రర్థ్యయుక్తి ♦ భజియింతు మదిన్.

౧. — ద్రవ్యము, గుణము, కర్మము, సామాన్యము, విశేషము, సమవాయము, అభావము, అని పదార్థము లేడు.

౨. — పృథివి, అప్పు (నీరు,) తేజస్సు, వాయువు, ఆకాశము, కాలము, దిక్కు, ఆత్మ, మనస్సు, అని ద్రవ్యములు తొమ్మిది.

౩. — రూపము, రసము, గంధము, స్పర్శము, సంఖ్య, పరిమాణము, ప్రథక్త్వము (వేఱుపాటు,) సంయోగము, విభాగము, పరత్వము (దూరత్వము,) అపరత్వము, (సామీప్యము,) గురుత్వము, ద్రవత్వము, స్నేహము, శబ్దము, బుద్ధి, సుఖము, దుఃఖము, ఇచ్ఛ, ద్వేషము, ప్రయత్నము, ధర్మము, అధర్మము, సంస్కారము. అని గుణము లిరువది నాలుగు.

౪. — ఉత్క్షేపణము (ఎగజిమ్ముట,) అపక్షేపణము (దిగద్రోయుట,) కుంచనము (ముడుచుట,) ప్రసారము (చాచుట,) గమనము (నడక,) అని కర్మము లయిదు.

౫. — పరము, అపరము, అని సామాన్యము ద్వివిధము.

౬. — నిత్యద్రవ్యములయం దుండు విశేషము లనంతములు.

౭. — సమవాయ మేకవిధము.

౮. — ప్రాగభావము (పూర్వమున లేకుండుట,) ప్రధ్వంసాభావము (నశించుటచే లేకుండుట,) అత్యంతాభావము (అసలే లేకుండుట,) అన్యోన్యాభావము, అని యభావము చతుర్విధము.

౯. — ద్రవ్యములలో గంధముకలది పృథివి. అది నిత్య, అనిత్య, అనిద్వివిధము. పరమాణురూపమయినదినిత్య; కార్యరూపమయినది యనిత్య. శరీర, ఇంద్రియ, విషయ, భేదములవలన ననిత్య మరల త్రివిధము. మనుష్యులు మొదలగువారిది శరీరము; నాసాగ్రవర్తియయి, గంధగ్రాహక మయిన ఘ్రాణ మింద్రియము; మృత్పాషాణాదికము విషయము.

౧౦. — శీతస్పర్శముగలది యప్పు (జలము.) అది నిత్య, అనిత్య, అని ద్వివిధము. పరమాణురూప మయినది నిత్య; కార్యరూప మయినది యనిత్య. శరీరము, ఇంద్రియము, విషయము, అనుభేదములవలన ననిత్య మరల త్రివిధము. శరీరము వరుణలోకమునం దుండును; జిహ్వాగ్రవర్తియయి, రసగ్రాహక మయిన రసన యింద్రియము; నదీ సముద్రాదికము విషయము.

౧౧. — ఉష్ణస్పర్శముగలది తేజస్సు. అది నిత్యము, అనిత్యము, అని ద్వివిధము. నిత్యము పరమాణురూప మయినది; అనిత్యము కార్యరూప మయినది. శరీరము, ఇంద్రియము, విషయము, అను భేదములవలన ననిత్యము త్రివిధము. శరీర మాదిత్యలోకమునం దుండును; కృష్ణతారాగ్రవర్తియయి, రూపగ్రాహక మయిన చక్షు రింద్రియము; భౌమము, దివ్యము, ఔదర్యము, ఆకరజము, అను భేదములవలన విషయము చతుర్విధము. వహ్న్యాదికము భౌమము, విద్యు (మెఱుపు) దాదికము దివ్యము, తిన్న దానిని జీర్ణముచేయుటకు హేతు

వయి యుదరమునం దుండునగ్ని యౌదర్యము; సువర్ణాదిక మాకరజము.

౧౨. — రూపరహిత మయి స్పర్శముకలది వాయువు. అది నిత్యము, అనిత్యము, అని ద్వివిధము. పరమాణురూప మయినది నిత్యము; కార్యరూప మయిన దనిత్యము. శరీరము, ఇంద్రియము, విషయము, అను భేదములవలన ననిత్యము త్రివిధము. శరీరము వాయులోకమునం దుండును; సర్వశరీరవర్తి యయి, స్పర్శగ్రాహక మైనత్వక్కు ఇంద్రియము; వృక్షాదికంపనహేతువు విషయము.

౧౩. — శరీరములోపల సంచరించువాయువు ప్రాణము; అది యొక్కటియే యయినను, ఉపాధిభేదములవలనం బ్రాణాపానాది సంజ్ఞలను బొందుచున్నది. [ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము. అను పంచవాయువులును పంచప్రాణము లనంబడును.]

౧౪. — శబ్దగుణము కలది యాకాశము, అదియొక్కటి యయి, అంతటను వ్యాపించి నిత్య మయి యుండును.

౧౫. — అతీతము (భూతము) మొదలయిన వ్యవహారమునకు హేతు వయినది కాలము. అది యేక మయి సర్వవ్యాప్త మయి, నిత్య మయి యుండును (భూతము, భవిష్యత్తు, వర్తమానము, ఇవి యతీతము మొదలయినవి.)

౧౬. — తూర్పు మొదలయినవ్యవహారమునకు యోగ్య మయినది దిక్కు. అది యేకమయి, సర్వవ్యాప్తమయి, నిత్యమయి యుండును, (తూర్పు, పడమర, ఉత్తరము, దక్షిణము, ఇవి తూర్పు మొదలయినవి.)

౧౭. — జ్ఞానాధికరణ (ఆధార) మయిన దాత్మ, అది పరమాత్మ, జీవాత్మ, అని ద్వివిధము. అం దీశ్వరుఁడును సర్వజ్ఞుఁడు నయినవా

మాత్మ యొక్కటియే; జీవాత్మ ప్రతిశరీరమునందును భిన్నమయి యుండును; అది సర్వత్ర వ్యాపించి నిత్యమయి యుండును.

౧౮. — సుఖదుఃఖాదులను బొందుటకు సాధనమైనయింద్రియము మనస్సు. అది ప్రత్యాత్మయందు నుండుటచేత ననంతమయి పరమాణురూపమై నిత్యమై యుండును.

౧౯. — చక్షు (కన్ను) ర్మాత్రముచే గ్రహింపఁ దగినగుణము రూపము. అది శుక్లము, నీలము, పీతము, రక్తము, హరితము (ఆకుపచ్చ), కపిశము (కోతివన్నె), చిత్రము, అను భేదములవలన సప్తవిధము. అది పృథివియందును, జలమునందును. తేజస్సునందును, ఉండును. వానిలోఁ బృథివి యందు సప్తవిధముల నుండును; జలమునందభాస్వరశుక్లమయి యుండును; తేజస్సునందు భాస్వరశుక్లమయి యుండును.

౨౦. — రసన (నాలుక) చే గ్రహింపఁ దగినగుణము రసము. అది మధురము, ఆమ్లము (పులుసు), లవణము, కటువు (కారము), కషాయము (ఒగరు), తిక్తము (చేదు), అను భేదములవలన షడ్విధము. అది భూమియందును, జలమునందును, ఉండును. అందు భూమియందు షడ్విధము; జలమునందు మధురముమాత్రము.

౨౧. — ఘ్రాణము (ముక్కు) చే గ్రహింప, దగినగుణము గంధము. అది సురభి (పరిమళము), అసురభి (కంపు), అని ద్వివిధము. అది పృథివియందుమాత్ర ముండును.

౨౨. — త్వగింద్రియమాత్రముచే గ్రహింపఁ దగినగుణము స్పర్శము. అది శీతము, ఉష్ణము, అనుష్ణాశీతము, అను భేదములవలనఁ ద్రివిధము. అది పృథివియందును, అప్పునందును, తేజస్సునందును,

వాయువునందును, అందు శీతము జలమునందును, ఉష్ణము తేజస్సునందును, అనుష్ణాశీతము పృథివీవాయువుల యందును నుండును.

౨౩. — పృథివియందు పాకజనితమైన రూపాదిచతుష్టయము (రూప, రస, గంధ, స్పర్శములు) అనిత్యము. ఇతరస్థలములయందు దపాకజనిత మయినది నిత్యానిత్యభేదమును గలిగి యుండును. నిత్యగత మైనది నిత్యము; అనిత్యగత మైన దనిత్యము.

౨౪. — ఏకాదివ్యవహారహేతువయినది సంఖ్య. అది తొమ్మిది ద్రవ్యములయందుండి, యేకత్వము మొదలు పరార్థమువఱకు నుండును. ఏకత్వము నిత్యమును, అనిత్యమును అయి యుండును. నిత్యగత మయినది నిత్యము; అనిత్యగత మయినది యనిత్యము. ద్విత్వాదిక మంతట నిత్యము.

౨౫. — మానవ్యవహార కారణ మయినది పరిమాణము. అది తొమ్మిదిద్రవ్యములయందు నుండును. అది, అణువు, మహత్తు, దీర్ఘము, హ్రస్వము, అని చతుర్విధము.

౨౬. — పృథగ్వ్యవహారకారణము పృథక్త్వము. అది సర్వద్రవ్యములయందు నుండును.

౨౭. — సంయుక్తవ్యవహారమునకు హేతు వయినది సంయోగము. అది సర్వద్రవ్యములయందు నుండును.

౨౮. — సంయోగనాశకగుణము విభాగము. అది సర్వద్రవ్యములయందు నుండును.

౨౯. — పరాపరవ్యవహారాసాధారణకారణము పరాపరత్వము. అది పృథివ్యాదిచతుష్టయమునందును, మనస్సునందును, ఉండును. అది దిక్కృతము, కాలకృతము, అని ద్వివిధము. దిక్కృత మయిన పరత్వము దూరస్థ మయిన వస్తువునం దుండును; దిక్కృత మయిన

యపరత్వము సమీపస్థవస్తువునం దుండును కాలకృత మయిన పరత్వము జ్యేష్ఠవస్తువునం దుండును; కాలకృత మయిన యపరత్వము కనిష్ఠవస్తువునం దుండును.

30.—ఆద్యపతనమున కసమవాయికారణ మయినది గురుత్వము. అది పృథివీజలములయం దుండును.

31.—ఆద్యస్యందనము (కారుట) న కసమవాయికారణ మయినది ద్రవత్వము. అది పృథివీజల తేజస్సులయం దుండును. అది సాంసిద్ధికము, నైమిత్తికము, అని ద్వివిధము. సాంసిద్ధికము జలమునం దుండును. నైమిత్తికము పృథివీతేజస్సులయం దుండును. పృథివీ సంబంధు లయిన ఘృతాదులయందు ద్రవత్వ మగ్నిసంయోగజము; తేజస్సంబంధులైన బంగారము మొదలైనవాని యందును ద్రవత్వ మగ్నిసంయోగజము.

32.—చూర్ణాదులు ముద్ద యగుటకు హేతు వయిన గుణము స్నేహము. అది జలమునందుమాత్ర ముండును.

33.—శ్రోత్రము (చెవి) చేత గ్రహింపఁ దగిన గుణము శబ్దము. అది యాకాశమునందు మాత్ర ముండును. అది ధ్వన్యాత్మకము, వర్ణాత్మకము, అని ద్వివిధము. ధ్వన్యాత్మకము భేర్యాదులయం దుండును; వర్ణాత్మకము సంస్కృతభాషాదిరూప మయినది.

34.—సర్వవ్యవహార హేతు వైన జ్ఞానము బుద్ధి. అది స్మృతి, అనుభవము, అని ద్వివిధము. సంస్కారమాత్రజన్య మయిన జ్ఞానము స్మృతి; తద్భిన్న మయిన జ్ఞాన మనుభవము. యథార్థము, అయథార్థము అని యనుభవజ్ఞానము ద్వివిధము. ఆయాగుణములు కలదానియం దాప్రకార మయిన (ఆయాగుణములు కలదనెడి) యనుభవము యథార్థము—రజతమునందు రజతజ్ఞానము యథార్థము; ఇదియే

ప్రమ యనఁబడును. ఆయాగుణములు లేనిదానియం దాప్రకార మయిన (ఆయాగుణములు కలవనెడి) జ్ఞానము అయథార్థము—శుక్తి యందు రజతజ్ఞాన మయథార్థము; ఇదియే భ్రమ యనఁబడును.

౩౫.—ప్రత్యక్షము, అనుమితి, ఉపమితి, శాబ్దము, అను భేదములవలన యథార్థానుభవము చతుర్విధము. ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము, అను భేదములవలనఁ దత్కరణము సహితము చతుర్విధము.

౩౬.—వ్యాపారవంత మైన యసాధారణకారణము కరణము. అనన్యథాసిద్ధకార్యనియతపూర్వవృత్తి కారణము; ప్రాగభావప్రతియోగి కార్యము.

౩౭.—సమవాయి, అసమవాయి, నిమిత్తము, అను భేదములవలన కారణము త్రివిధము. పటమునకు తంతువులవలెను, స్వగతరూపాదులకు పటము (బట్ట) వలెను, దేనినుండి సమవేత (విడువని సంబంధముగల) కార్యము పుట్టునో యది సమవాయి కారణము. పటమునకు తంతు (దారముల) సంయోగమువలెను, పటగతరూపమునకు తంతురూపమువలెను, కార్యముతోఁగాని కారణముతోఁగాని యేకార్థమునందు సమవేతమైనకారణ మసమవాయికారణము; పటమునకు కుంచెవలెను, మగ్గమువలెను, తదుభయభిన్నమైన కారణము నిమిత్తకారణము. ఈ త్రివిధకారణములలో నసాధారణమైన కారణ మేదో యదియే కరణము.

౩౮.—అందుఁ బ్రత్యక్షజ్ఞానకరణము ప్రత్యక్షము. ఇంద్రియార్థసన్నికర్షజన్యమైన జ్ఞానము ప్రత్యక్షము. అది నిర్వికల్పము, సవికల్పము, అని ద్వివిధము. ఇది యేదోయొకటి యనునట్లు నిష్ప్రకారక మైన

జ్ఞానము నిర్వికల్పము; ఇతఁడు డిద్ధుఁడు, ఇతఁడు బ్రాహ్మణుఁడు, ఇది నలుపు, అనునట్లు సప్రకారకమైన జ్ఞానము సవికల్పము.

౩౯.—సంయోగము, సంయుక్తసమవాయము, సంయుక్తసమవేత సమవాయము, సమవాయము, సమవేతసమవాయము, విశేషణవిశేష్యభావము, అని ప్రత్యక్షజ్ఞానహేతు వయిన యింద్రియార్థసన్నికర్షము షడ్విధము. కంటికి ఘటము ప్రత్యక్ష మయినప్పుడు సంయోగసన్నికర్షము; చక్షుస్సంయుక్తమైన ఘటమునందు రూపముయొక్క సమవాయమువలన ఘటరూప ప్రత్యక్షమునందు సంయుక్తసమవాయసన్నికర్షము; చక్షుస్సంయుక్తమైన ఘటమునందు సమవేత మయిన రూపము రూపత్వమునకు సమవాయ మగుటవలన రూపత్వసామాన్య ప్రత్యక్షమునందు సంయుక్తసమవేత సమవాయ సన్నికర్షము; కర్ణరంధ్రమునం దుండెడియాకాశముయొక్క శ్రోత్రత్వము వలనను, శబ్దముయొక్క యాకాశగుణత్వమువలనను, గుణిగుణముల యొక్క సమవాయమువలనను శ్రోత్రమునకు శబ్దసాక్షాత్కార మయినప్పుడు సమవాయసన్నికర్షము; శ్రోత్రసమవేతమైన శబ్దమునందు శబ్దత్వముయొక్క సమవాయమువలన, శబ్దత్వసాక్షాత్కారమునందు సమవేతసమవాయిసన్నికర్షము; భూతలము ఘటాభావమును గల దనుచో చక్షుస్సంయుక్తమైన భూతలమునందు ఘటాభావము యొక్క విశేషణత్వమువలన, అభావప్రత్యక్షమునందు విశేషణవిశేష్యభావసన్నికర్షము. ఈసన్నికర్షములవలనఁ గలిగినజ్ఞానము ప్రత్యక్షము. దీని కింద్రియము కరణము కాఁబట్టి యింద్రియము ప్రత్యక్షప్రమాణ మనుట సిద్ధము.

౪౦.—అనుమితియొక్క కరణ మనుమానము. పరామర్శజన్యమైన జ్ఞాన మనుమితి. వ్యాప్తివిశిష్ట పక్షధర్మతాజ్ఞానము పరా

మర్శము—ఎట్లనఁగా, ఆపర్వతము వహ్నివ్యాప్యమైన ధూమమును కలది యనుజ్ఞానము పరామర్శము; దానివలనఁ గలిగిన పర్వతము వహ్నిమంత మనుజ్ఞాన మనుమితి: ఎక్కడ ధూమ ముండునో యక్కడ వహ్ని యుండు నను సాహచర్య నియమము వ్యాప్తి వ్యాప్యముయొక్క పర్వతాదివృత్తిత్వము పక్షధర్మత.

౪౧—స్వార్థము, పరార్థము, అని యనుమానము ద్వివిధము. స్వానుమితి హేతువు స్వార్థము-ఎట్లనఁగా, తానే పలుమాఱు చూచుట చేత వంటయిల్లు మొదలైనవానియం దెక్కడధూమ ముండునో యక్కడ నగ్ని యుండు నని వ్యాప్తిని గ్రహించి, పర్వతసమీపము నకుఁ బోయినవాఁడయి పర్వతమునందలి పొగను జూచి దానియం దగ్ని యుండునా యనిసందేహపడి, ఎచ్చటధూమముండునో యచ్చట నగ్నియుండు నన్నవ్యాప్తిని స్మరణకుఁ దెచ్చుకొనుచున్నాఁడు; తదనంతరము పర్వతము వహ్నివ్యాప్యధూమవంత మని జ్ఞానము కలుగుచున్నది; దీనినే లింగపరామర్శ మందురు; అందువలనఁ బర్వతము వహ్నిమంత మనెడు యనుమితి పుట్టుచున్నది; అది స్వార్థానుమానము ధూమమువలన నగ్నిని దానే యనుమానించి, పరులకు బోధించుట కొఱకుఁ బంచావయవ మైనవాక్యమును బ్రయోగించినప్పు డది పరార్థానుమాన మగును—ఎట్లనఁగా,

(౧) పర్వతము వహ్నిమంతము;

(౨) ధూమవత్త్వమువలన;

(3) మహానసము (వంటయిల్లు) వలెనే యేది ధూమవంతమో అది యగ్ని మంతము;

(౪) ఇదియు నాలాగుననే;

